

శ్రీ శారదాదేవి



శ్రీ రామకృష్ణుని షోడశీపూజ

(ఓం)

# శ్రీ అనుభవానంద గ్రంథమాల

ఉద్దేశ్యము :- ఈ గ్రంథమాలలో శ్రీ అనుభవానంద స్వాములవారిచేతను యితరులచేతను రచితములైన భక్తి జ్ఞాన వైరాగ్య ప్రబోధక గ్రంథములు ప్రకటింపబడును.

విధానము :- సంవత్సరమునకు మొత్తమునకు రెండువందల పుటలుగల గ్రంథములు వెలువడుచుండును.

విరాళము :- 1) రు 500/- మించు విరాళ మొసంగువారు మహారాజ పోషకులు. ఒక ముఖ్య గ్రంథమున వీరి ఫొటో ప్రకటింప బడును. వీరి నామములు ప్రతికుసుమమున ముద్రింపబడుచుండును. గ్రంథ మాల ప్రచురణములన్నియు నుచితముగ వీరికొసంగబడును.

2) రు 100/- మించు విరాళ మొసంగువారు రాజపోషకులు. ప్రతి గ్రంథమున వీరి నామములు ముద్రింపబడుచుండును. మరియు గ్రంథమాల ప్రచురణము లన్నియు వీరుకూడ నుచితముగ బడయుదురు.

3) రు 50/- మించు విరాళ మొసంగువారు పోషకులు. వీరి నామ ములు అన్ని ప్రచురణముల ప్రకటింపబడును. ప్రచురణముల వీరు సగము ధరలకు బడయుదురు.

4) రు 25/- మించు విరాళ మొసంగువారు మిత్రులు. ప్రచురణముల 3/4 ధరలకు బొందుదురు.

5) రు 10/- మించు విరాళ మొసంగువారు సభ్యులు. ప్రచురణముల వీరు 1/8 తగ్గింపు ధరలకు బొందుదురు.

గ్రంథమాలయొక్క మహోద్యమమునకు ఎల్లరు ఉచితరీతి తోడ్పడుదురుగాక.

# ఏరాళీకర్తలు

## మహారాజపోషకులు

## రు. 516/-

1 శ్రీ బలభద్రుని చెన్నయ్యశెట్టిగారు & సన్సు కమీషన్ మర్చంట్సు, ఆయిల్ మిల్సు, భీమునిపట్టణము.

2 శ్రీ పులవర్తి సుబ్రహ్మణ్యం శెట్టిగారు & సన్, శ్రీవెంకటేశ్వర ఆయిల్ మిల్సు, భీమునిపట్టణము.

3 శ్రీ నందగిరి వేంకట రామదాసు పంతులుగారు & సన్సు, శెర్లపాలెము, భీమునిపట్టణము.

## రాజపోషకులు

## రు. 100/-

1 శ్రీ మెంటా ఈశ్వరయ్యగారు, కమీషన్ మర్చంట్సు, నెల్లూరు. రు 300

2 పనుమర్తి శేషాచలం శెట్టి గారు, క్లాత్ మర్చంట్సు.

3 నూనె శేషాచలం శెట్టిగారు, రైసుమిల్సు, & కమీషన్ మర్చంట్సు.

4 నూనె జగ్గయ్య శెట్టిగారు, రైసుమిల్సు, & కమీషన్ మర్చంట్సు.

5 చిత్తూరు మునుస్వామి మొదలియార్ గారు, కమీషన్ మర్చంట్సు. రు 116

6 యడ్లపల్లి గోవిందు శెట్టిగారు, ఐరన్ & ఫర్టిలైసర్సు. రు 116

7 గాలి నారాయణరావు గారు M. A., L. T., రిటైర్డు ప్రిన్సిపాల్, కర్నూలు ఉస్మానియా కాలేజి.

8 కొత్తూరి రామయ్య, కర్పూరపు రామకృష్ణమూర్తి కంపెనీ, టుబాకో మర్చంట్సు. గుంటూరు.

9 పోలిశెట్టి సోమసుందరంగారు, టుబాకో మర్చంట్సు.

10 శ్రీ కర్పూరపు వెంకటనారాయణగారు, టుబాకో మర్చంట్సు.
11 వంకాయల కోటేశ్వరుడుగారు, టుబాకో మర్చంట్సు.
12 కర్పూరపు కనకవల్లి తాయారమ్మ గారు.
13 ద్విభాష్యం అన్నపూర్ణయ్యగారు.
14 బొలిశెట్టి సీతారామయ్యగారు, అడ్వొకేటు, బాపట్ల. రు 232
15 బూపరాజు వేం. నరసింహారావుగారు, వైద్యులు, స్వర్ణ.
16 బొడ్డుపల్లి సీతారామస్వామి శాస్త్రిగారు, కర్లపాలెం.
17 మంతెన వేంకట రామరాజుగారు B. A., బుద్దాం. రు 116
18 పురిపాక సూర్యప్రకాశరావుగారు, కరణం, అమృతలూరు.
19 వేంకటేశ్వరస్వామివారి దేవస్థానము, బచ్చుపేట, బందరు. రు 116
20 వల్లూరి వేంకట సూర్యనారాయణగారు, వకీలు.
21 యద్దనపూడి రామచంద్రరావుగారు.
22 తాడంకి వేంకటకృష్ణారావుగారు, అడ్వొకేటు.
23 మోటమర్రి దయానిధిగారు.
24 తాడికొండ నాగేంద్రరావు గుప్తగారు, మెడికల్ షాపు.
25 చిత్రపు అచ్యుతరామయ్యగారు.
26 దీవి సేతు మాధవాచార్యులుగారు.
27 అద్దేపల్లి వేంకటరామయ్యగారు.
28 పిన్నమనేని లింగయ్య చౌదరిగారు, అడ్వొకేటు. రు. 116
29 జక్కిపూడి వేంకటేశ్వర్లుగారు. విజయవాడ.
30 బొమ్మదేవర హేమలతాదేవి బహద్దర్ వారు. ఏలూరు.
31 చావలి సీతారామయ్యగారు, అగ్రికల్చరల్ ఇంజనీయరు.
32 బండి వీరరాఘవమ్మగారు, చింతలపూడి.
33 బండి రామారావుగారు.
34 మంచిరాజు చిన వేంకటరత్నంగారు, భీమడోలు.
35 మావులేటి సోమరాజుగారు, గుండుగొలను.
36 దుర్గంపూడి ధర్మరాజుగారు.
37 భీమవరము వర్తకసంఘభవన గ్రంథాలయము, భీమవరము.
38 ఇమ్మిడి సత్యనారాయణగారు, కమీషన్ మర్చంట్సు, పాలకొల్లు.

39 శ్రీ కొండాడ వేంకటరాజు గుప్తగారు, క్లాత్ మర్చంట్సు.
40 రాజులపాటి వేంకటేశ్వర్లుగారు.
41 అద్దేపల్లి సత్యనారాయణమూర్తిగారు, M. L. A.,
42 కలగ వేంకట సూర్యసత్య శంభుప్రసాద్‌గారు.
43 బల్రెడ్డి తమ్మేశ్వరరావుగారు, పోస్టు మాస్టరు.
44 దశిక రామారావుగారు, B. D., ఎక్స్‌టెన్‌షన్ సూపర్వైజర్,
కొవ్వూరు.
45 నిట్ట భీమశంకరంగారు, రిటైర్డు ఇన్‌కంటాక్సు ఆఫీసరు,
రాజమండ్రి.
46 చిన్ని తరుణయ్యగారు, B. E., (మెకానికల్)
ఇంజనీరింగు కాలేజి, కాకినాడ.
47 కాళ్ళకూరి సూర్యనారాయణగారు, అల్లిపురము విశాఖపట్టణము.
48 తులుకూరి సన్యాసిశెట్టిగారు, జనరల్ మర్చంట్సు.
49 బెండపూడి వీరరాజుగారు, M. B. B. S.,
50 పలుకూరి జగన్నాథరావు గారు.
51 దేవులపల్లి కృష్ణమూర్తిగారు బి. ఇ (ఎలక్ట్రికల్)
ఆంధ్రాయూనివర్సిటీ.
52 ఉద్దగిరి శ్రీరామమూర్తిగారు, కమీషన్ మర్చంట్, అనకాపల్లి.
53 కలిగొట్ల సూర్యనారాయణగారు, ము॥ చైర్మన్, భీమునిపట్టణము.
54 దుర్గా దానయ్యశెట్టిగారు, & సన్, మర్చంట్సు.
55 ఏడిద సూర్యనారాయణమూర్తిగారు.
56 రాయపురెడ్డి అప్పారావు నాయుడుగారు, వైస్‌చైర్మన్.
57 పొట్లా వీరరాజుగారు. రు 116
58 సుదురుపాటి వీరరాజు గారు, కిర్లపాలెం.
59 శారదా గ్రంథాలయము. రు 116
60 పోలిశెట్టి వెంకటరమణయ్యగారు, (రాజా)
కమీషన్ మర్చంట్సు, విజయనగరము. రు 116
61 మాటూరి లింగమూర్తిగారు, క్లాత్ మర్చంట్సు.
62 సింహాద్రి మహాలక్ష్మమ్మగారు, గజపతినగరము. రు 116

63 శ్రీ ఆడక్కి వేం. కృ. హనుమంతరావుగారు, శ్రీకాళహస్తి.
64 పూసపాటి రామచంద్రరాజుగారు, B. E., ఎగ్జక్యూటివ్ ఇంజనీయరు.
65 కొత్తా రమణాజీరావుగారు, కమీషన్ మర్చంట్సు, బొబ్బిలి.
66 నంగునూరు మహబూబురెడ్డిగారు, దేశిముఖ్, వరంగల్లు.
67 గైనేడి వెంకట అప్పారావుగారు, L. M. P., హైదరాబాదు.
68 వీరమసేని గోపాలరావుగారు, డిప్యూటీ డైరెక్టరు సివిలుసప్లయిస్.
69 వి. యస్. వారణాసిగారు, రిటైర్డు అసిస్టెంటు స్టేట్ కమీషనరు.
70 యస్. వేణుగోపాల్‌గారు, రిపోర్టరు, లెజిస్లేచరు సెక్రటరేటు.
71 కనకదండి భాస్కరరావుగారు, B. Sc., ఇన్‌కంటాక్సు ఇన్‌స్పెక్టరు, హైదరాబాదు.
72 మహమ్మదు రహింతుల్లాగారు, M. L. A., ము॥ చైర్మన్, కడప.
73 రామకృష్ణ సమాజ గ్రంథాలయము.
74 రావూరు రంగనాథంగారు, అడ్వోకేటు.
75 పోలిపల్లె వెంకన్న శ్రేష్ఠిగారు, వల్లూరు.
76 ముత్యాల లక్ష్మయ్యశెట్టి & సన్స్, కమీషన్ జనరల్ మర్చంట్సు, తిమ్మనచర్ల.
77 జూటూరు దాసప్ప & సన్సు, జనరల్ మర్చంట్సు.
78 యస్. నాగప్పగారు, స్కిన్ మర్చంట్సు.
79 యస్. కొమరప్ప & సన్స్ బ్యాంకర్సు, బళ్ళారి.
80 కె. లక్ష్మిపతి & సన్, కమీషన్ మర్చంట్సు.
81 కె. సన్న ఓంకారప్పగారు, మర్చంట్సు.
82 ఐ. వెంకటరత్నం నాయుడుగారు, L. M. P.,
83 జయంతి రుద్రయ్యశెట్టిగారు. బ్యాంకర్సు. రాయదుర్గము.
84 చిందనూరు నాగప్పశెట్టిగారు, కమీషన్ మర్చంట్సు.
85 తల్లం హనుమంతప్పశెట్టిగారు, కమీషన్ మర్చంట్సు.
86 టి. రాజశేఖర రెడ్డిగారు, అలంపురము.

87 రావుబహదూర్ టి. ఆర్. రామచంద్రశాస్త్రి గారు,
అడ్వోకేట్, కర్నూలు
గీతా సేవాసమితి, కళ్యాణదుర్గము.

88 శ్రీ మలుగూరు సంజీవప్పగారు, కనగానపల్లి.

89 ఎ. యం. శిబలాపతి శ్రేష్ఠిగారు,
B. com., B. L., F. S. A. A., ఇన్కంటాక్సు
ప్రాక్టీషనరు, అడ్వోకేటు, మద్రాసు.

## పోషకులు

## రు. 50/-

1 శ్రీ ఎలిశెట్టి సుబ్బారాయుడుగారు, గోల్డు మర్చంట్సు, నెల్లూరు. రు 58

2 గ్రైత్రి సత్యనారాయణగుప్తగారు, విద్వాన్ విజయవాడ.

3 పసుమర్తి సుబ్బరాజుగారు, G. D. A., F. C. A.,
అసిస్టెంటు మానేజరు, ఇన్సూర్యరెన్సు కార్పోరేషన్ ఆఫ్
ఇండియా, బొంబాయి.

4 తుమ్మల వేంకటేశ్వరరావుగారు, భీమడోలు.

5 కొండ ఈశ్వరరాజుగారు, గుండుకొలను.

6 ఉనికిలి వేంకటరాజుగారు.

7 సదురుపాటి సత్యనారాయణగారు, భీమునిపట్టణము. రు 58

8 పూసర్ల శ్రీ అప్పలనరసయ్యగారు, టింబరుమర్చంట్సు
విజయనగరము. రు 58

9 వెలగపూడి సుందరరామ దత్తుగారు, నెల్లూరు.

10 తాయి మల్లిఖార్జునప్ప శెట్టిగారు, మర్చంట్సు, రాయదుర్గము.

——(o)——

# ప్రస్తావనము

'మన శారదామాయి' అను చిన్ని పొత్తమును, మన మాతాజీ బంధుమిత్రాది సంఘమును ద్యజించి, పూర్వాదర్శ ముల ప్రక్కనుంచి, మహోత్కృష్టాదర్శమును దన హృదయ ఫలకమున దీర్చి దిద్దుకొనుటకై 1953 లో వ్రాసికొని యుండెను. కాని ఆ పరమ పవిత్రమూర్తిని తన దృక్పథమున జిత్రించుకొని, ఆ దివ్యాధ్యాత్మికాదర్శ మూర్తిమత్వమున దా నంతర్లీనమై ఏకత్వమునొందు మహాదాదర్శమున అమితోత్సాహమున విష యముల గాలదన్ని, అతి పిన్నవయస్సున నీ యలౌకిక లోక మునకు దుమికిన మన మాతాజీ హృదయముగూడ నీ చిన్న రచనమున ననుస్యూతమై ప్రస్ఫుటమై యొప్పుటచే మాతాజీ శారదామాయిల ఏకస్వన స్వరూపముగ నీ గ్రంథ మలరారు చుండుటచే మాకెంతయో ఆనందముగలిగి, వీరి పరమ పవిత్రా దర్శములు సంఘమున కెంతయో యుపయుక్తమని విశ్వసించి, ఉత్సహించి 1953 న శ్రీ శారదా శతవార్షిక జయంతి సందర్భమున బ్రకటించి యుంటిమి.

మా సంకల్పమున కనుగుణముగ నీ పుస్తకమును పత్రి కలు, పండితులు, పామరులు, ఎల్లరును మోదమున స్వీకరించి కొనియాడి యుండిరి. ఈ యపూర్వాదర్శము అనేక సాధక హృదయములలో నూత్నచైతన్యమును రగుల్కొల్పి మార్గ దర్శక మగుటయు నాశ్చర్యకరము కాదు.

మరల నీ 'మన శారదామాయి' గ్రంథము పునర్ముద్రణ మున బ్రవేశింప, పూర్వరూపమున గాక, నిసుమంతగ నభివృద్ధి యవసరమనితోచి పెంచి వ్రాయబడినది. క్రమపరిణామ మెప్పు డును అభిలషణీయమును, ఆరోగ్యవంతమును గదా! కాల గమనము ననుసరించి అధికతరోపయుక్తముగూడ కావలయును గదా!

అందుచే నీ 'మన శారదామాయి' యీ నూత్నమును అందమును పవిత్రమును అయిన స్వరూపమున నెల్లర కానంద దాయకమై వారివారి ఆధ్యాత్మిక జీవితముల బాసటయై విరా జిల్లుగాక అని ఆశించెదము. అందులకు పరమేశ్వరుడును ఆశీర్వదించి పోషించి పెంచును గాక!

బాపట్ల.
21-8-60.

—

## To The Divine Mother

Were I a bit of thread,
I could be woven into your garment
And stay close to you.

Were I a piece of leather,
I could be made into sandals
To protect your beloved feet.

Were I a mango,
You could eat me quickly - what joy !
But alas ! I am not one of these.

Cecille Pomerene.

నే నొక దారపుప్రోగునై యుండినచో,
నీ వస్త్రమున నల్లబడి యుండగలిగి
నీ కతి సన్నిహితముగ నుండగలను.

నే నొక చర్మఖండమునై యున్నచో,
పాదరక్షలుగ నేను గాగలిగి
నీ ప్రియచరణముల రక్షించి యుందును.

నే నొక మామిడి ఫలమునై యున్నచో,
నీవు నన్ను త్వరగ తినియుందువు-ఎంత ఆనందము !
కాని అకటా ! వీనిలో నొక్కటి నే గాదుగదా !

సిసిలీ పోమరీన్.

# ప్రేమార్పణము

నా యాధ్యాత్మిక జీవిత విధానమునకు
కారణభూతయగు

మా

అమ్మ

శ్రీమతి లక్ష్మీ గున్నమ్మగారికి

ఓం

శ్రీ మాతృదేవ్యైనమః

# మన శారదామాయి

## ప్రవేశనము

శ్లో॥ పవిత్రం చరితం యస్యాః పవిత్రం జీవనం తథా।
పవిత్రతా. స్వరూపిణ్యై తస్యైదేవ్యై నమో నమః॥

మన ఆర్ష సంస్కృతి సంకుచితగుణదూరమై, సకల సద్గుణ సుశోభితమై, విశాలమై, సర్వాదర్శకమై, సర్వ వంద్యమై వెలుగొందుచున్నది. ఆ దివ్య సంస్కృతీ పర్యవసాన పారమార్థికసంపద పరంపరాగతమై అవతారవరేణ్యుల, జగద్గురువుల, మహాపురుషుల. యోగినీమణుల, బ్రహ్మవాదినుల వెల్లువమై బ్రవహించి ప్రపంచమును ముంచెత్తినది. అట్టి సర్వ భేద రహితమును సకల ద్వంద్వవిదూరమును అగు నా అద్వైతానందామృతమున స్త్రీపురుష భేదమే లేదు. అందుచేతనే 'త్యాగేనైకే అమృతత్వం' ఒక్క త్యాగముచేతనే అమృతత్వమని కైవల్యము, 'బ్రహ్మచర్యాదేవ ప్రవ్రజేత్' బ్రహ్మచర్యము నుండియే సన్న్యసింపవలయును, 'యదహరేవ విరజేత్తదహరేవ ప్రవ్రజేత్' ఎపుడు వైరాగ్యముదయించునో అపుడే సన్న్యాసము స్వీకరింపవలయునని నారదపరివ్రాజకము, 'తత్వశ్యేత్ అగ్ర్యయా బుద్ధి సూక్ష్మయా' సూక్ష్మమును సునిశితమగు

బుద్ధిచే నా బ్రహ్మమును గాంచవలయు నని ముండకము మున్నగు నుపనిషత్ వాక్యసంచయమునను, 'అభ్యాస వైరాగ్యాభ్యాం' అభ్యాసవైరాగ్యములచేతను, 'అభ్యాసేన లభ్యః' అభ్యాసముచే లభ్యము అను యోగసూత్రవాక్య తతియందును, 'సత్వాత్ సంజాయతే జ్ఞానం' సత్వము వలననే జ్ఞానోద్భవమనియు, 'తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా। ఉపదేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞానినస్తత్వదర్శినః॥' ఆజ్ఞానము సాష్టాంగనమస్కృతిచేతను పునఃపునః ప్రశ్నించుటచేతను, సేవచేతను నీకు బ్రహ్మజ్ఞులైన జ్ఞానులు ఉపదేశింపగలరు. గ్రహింపుము అను శ్రీ భగవద్గీతా శ్లోకములందును, బ్రహ్మానందసుధాస్వాదనము చేయువారి అధికారి నిర్ణయమే వ్యక్తమగుచున్నది కాని స్త్రీపురుషభేద ప్రశంసయే అట నగోచరము. బ్రహ్మానుభూతికి పైన వివరింపబడిన గుణయుక్తులగు స్త్రీలైనను పురుషులైనను అర్హులనియేగదా తాత్పర్యము. అయినను ప్రత్యేకముగ 'సర్వవర్ణాధికారశ్చ నారీణాం యోగ్య ఏవ చ' సర్వవర్ణాధికారములు స్త్రీలకును యోగ్యములే అని గౌతమీ తంత్రశాస్త్రమును; 'పురాకల్పే కుమారీణాం మౌంజీ బంధనమిష్యతే। అధ్యాపనం చ వేదానాం సావిత్రీ వచనం తథా॥' పూర్వకాలమున బాలికలు ఉపనయన సంస్కారమునొంది, అరణ్యవాసులగు మహర్షుల సన్నిధానమున బ్రహ్మచర్యము నవలంబించి, సావిత్రీమంత్ర గ్రహణమునకును వేదాధ్యయనమునకు నధికారులై చెల్వొంది యుండిరని యమస్మృతియు, నాధ్యాత్మిక పథమున వనితలకుగల యర్హతను వ్యక్తపరచుచున్నవి. అనగా 'సత్వాం జ్ఞానం అనంతం

బ్రహ్మ' సచ్చిదానంద స్వరూపమును, 'అదృష్ట మవ్యవహార్య మగ్రాహ్య మలక్షణ మంచిత్య మవ్యపదేశ్య మేకాత్మప్రత్యయ సారం ప్రపంచోపశమం శాంతం శివం అద్వైతం' అను శ్రుతి రీతి నదృష్టత్వాది యద్వైతపర్యంత ప్రపంచవ్యతిరేక లక్షణ ములుగల నా బ్రహ్మ స్వరూపమును త్యాగప్రధానులైన స్త్రీలుసైతము పొందనగుననియే శ్రుతి స్మృతి పురాణ తంత్ర శాస్త్రముల దాత్పర్యము. పై శ్రుతి స్మృతి వాక్యానుగుణ్య ముగ నారీమతల్లులు వేదాధ్యయనము గావించియు, పండిత సభలందు వేదాంత సింహములమాడ్కి వాదోపవాదముల నొనర్చియు, బ్రహ్మచర్యదీక్ష గైకొనియు, 'స్త్రీణామపి ప్రాగ్వివాహాద్వా వైధవ్యాదూర్ధ్వం సన్న్యాసేఽధికారోఽస్తీతి దర్శితం। తేన భిక్షాచర్యం మోక్షశాస్త్ర శ్రవణం ఏకాంతే ఆత్మధ్యానం చ తాభిరపి కర్తవ్యం। త్రిదండాదికం చ ధార్యం'। వివాహ పూర్వముకాని, వైధవ్యానంతరముకాని స్త్రీలకును సన్న్యాసాధికారము కలదని దర్శితము. ఆ సన్న్యాసస్వీకరణ ముచే భిక్షాటనము, మోక్షశాస్త్ర శ్రవణము, ఏకాంతమున నాత్మధ్యానము వారికిని చేయదగినవియే. మరియు త్రిదండాదిక ధారణముగూడ గలదనియే మహాభారతమున మోక్షధర్మము వచించురీతి బ్రహ్మచర్యము నుండియే విరాగధనులై సన్న్యాస మును గ్రహించియు, గఠిన తపోనియతిచే మనోపారిశుద్ధతను గడించియు, నమ్మనోగత నిర్మలత్వముచే జరామరణదూరమగు అమృతత్వమును, అనగా మోక్షసామ్రాజ్యమును, 'కేవలీభావః కైవల్యః' అను యోగశాస్త్రమురీతి గైవల్యము బొంది

పరమానందాంబుధి నోలలాడుచు ప్రపంచమున కాదర్శులై నేటికిని పండితలోకముచే వేనోళ్ళ నుతింపబడుచున్నారు.

వేద దర్శన పురాణ ఇతిహాస కాలములోని కొందరు వనితారత్నముల ప్రతిభలగూర్చి గ్రహింతముగాక! సకలవేదముల నర్థ సహితముగ నధ్యయనము గావించి, తపస్వినియై, బ్రహ్మవాదినియై, జనకుని సభాస్థలి యాజ్ఞవల్క్య మహర్షి సత్తముని నెదుర్కొని వాదించినది, అపరవిద్యా స్వరూపిణియైన గార్గి. కేవలము వేదపఠనమేగాక, సర్వప్రపంచమునకాధారమును,ఆదిగ్రంథమును అగు ఋగ్వేదమున కొన్ని ఋక్కులకుగూడ స్వయముగా మంత్ర నిర్మాతయై ఆదర్శమై రాజిల్లెను, సన్యాసినియు విదుషీమణియునైన ఘోషనామక నారీరత్నము. అట్ణే వాక్ నాబడు యువతీలలామయు ఋగ్వేద మంత్ర కర్త్రి. మరియు విశ్వవార యను తపస్విని స్వయముగ యజ్ఞముల నొనరించినట్లు ఋగ్వేదమున గోచరము. అంతియగాక 'గోధా ఘోషా విశ్వవారా అపాలోపనిషత్। బ్రహ్మజాయా జుహూర్నా మాగస్త్యస్య స్వసాదితిః। లోపాముద్రా చ నద్యశ్చ యామీ నారీ చ శాశ్వతీ। శ్రీర్లాక్షా సర్వరాజ్ఞీ వాక్ శ్రద్ధా మేధా చ దక్షిణా। రాత్రిః సూర్యా చ సావిత్రీ బ్రహ్మవాదిన్య ఈరితాః।' గోధా, ఘోషా, విశ్వవార మొదలగు వారిని బ్రహ్మవాదినులుగా బృహద్దేవత వాకొనినది. బ్రహ్మవాదినులనగా 'ఉపనయన మగ్నీంధనం వేదాధ్యయనం' ఉపనయన, అగ్నికార్య, వేదాధ్యయనశీలురని హారీతధర్మసూత్రములు నిర్వచించినవి. పై విధానమున వేదకాలమునను కొందరుగలరోగదా!

దర్శనకాలమున జూచినచో, షడ్దర్శనములలో న్యాయ దర్శన కర్తయగు గౌతమ మహర్షి పుంగవునకు బూర్వమే న్యాయశాస్త్ర ప్రవీణయగు సుబాల యను సన్న్యాసిని ప్రఖ్యాతము. మరియు బాల్యముననే, చంచలమును, బుద్బుద తుల్యముగ క్షణికమును, నశ్వరమును నగు విషయవాసనల ద్యజించి, ఆధ్యాత్మికస్థితుల నుత్కృష్ట నిర్వికల్పాది సమాధ్య వస్థల బొంద నిచ్ఛగించి, కాననభూముల దీవ్రతపోనిష్ఠ జెలంగి, హృదయ పవిత్రతచే దాను గోరు సమాధిసంస్థితుల నార్జించి, తుచ్ఛ విషయసుఖ నిమగ్నులును, సంసారపాశ బద్ధులును, సంసృతి బాయజాలక గీటకములవోలె నందుండు ప్రాపంచిక జీవుల దుఃఖనినాదంబులు తన చెవులకు ములుకులైసోక, నిస్స్వార్థయు బ్రేమమూర్తియును గోణికానామధేయయు నగు నాతపస్విని ప్రపంచము నుద్ధరించుటకై యొక శిష్యుడవసరమని భావించి, 'ప్రాజ్ఞ మర్హ్యయ సుతం మమ 'ప్రాజ్ఞుడైన సుతుని అనగా శిష్యు నిమ్మని మహేశ్వరుని బ్రార్థించి, తపమును తీవ్రతర మొనరించి ఆతపచ్ఛక్తిచే బరమేశ్వరు మెప్పించెను. అంత నీశ్వరాదేశానుసారముగ, సమస్త భూభార నిర్వహణ సమర్థుడగు యాదిశేషుడు, 'జన్మ తాపసకులే పరిశుద్ధే శీలం యీశగృహిణీస్పృహణీయం। తాం చ వీక్ష్య తపసా గ్లపితాంగీం మాతరం' అను పతంజలిచరిత వాక్యము పగిది దాపసవంశో ద్భూతయు, బరిశుద్ధశీలయు, సాక్షాదీశ్వరి తానే యని సదా భావించునదియు, దపముచే గృశీభూతశరీరయు నగు నాగోణికా మూర్తిని సంతోషస్వాంతుడై తిలకించి, ఆయోగిని భాస్కరున కర్ఘ్యప్రదాన మొనరింప జలముల నంజలి గొనియుండ నందు

సూక్ష్మరూపమున ప్రవేశించి, అర్ఘ్యమిడుకాలమున ద్వాదశ వర్షప్రాయ బాలకుడై అంజలినుండి పృథ్వీస్థలి నవతరించెను. ఆమెయు నాకుమారుని వీక్షించి సప్రేమంబున గౌగిలించేర్చి, 'అంజలేః పతిత ఇతి పతంజలిః' అను వ్యుత్పత్తి ననుసరించి అంజలినుండి పడుటచే బతంజలియని యాబాలకునకు నామమిడి, ప్రపంచోద్ధరణమునకై తన సకలానుభవకోటిని వివరించి, సాధనానుభవపూర్ణ మగు యోగదర్శనమునకు నిర్మాతగా నతని రూపొందించెను, కాశ్మీర దేశమునగల గోనర్ద దేశీయయు బ్రహ్మ విద్యా స్వరూపిణియు నగు గోణికానామక తపస్వినీ తిలకము.

మరియు బురాణకాలమున దిలకింప, నొక రాజచంద్రుని పుత్రియై, పసితనంబుననే విషయలంపటముల దగుల్కొనక, నరణ్యముల దపమాచరించి, బ్రహ్మానందము నాస్వాదించి, అందు తన్మయయై, యోగధర్మానుష్ఠాతయై, 'మహీ మను చచారైకా సులభానామ భిక్షుకీ' పరివ్రాజికయై దేశసంచార మొనర్చుచున్న సులభ నాబడు ఒక సన్న్యాసిని, నిష్కామకర్మ రతుడును, రాజయోగియును, సుప్రసిద్ధ సాంఖ్యతత్త్వవేత్తయగు బంచశిఖాచార్యుని శిష్యుడును, మిథిలాపురాధీశ్వరుడును వేదాంతియునగు జనకునితో 'భైక్ష్యాచర్యాపదేశేన' భిక్షాటన నెపమున దర్శించి, దర్కించి, ఆ రాజవరేణ్యునిచే బూజా సత్కారముల నొందినట్లు మహాభారతగ్రంథ కథనము. ఇట్లే యసంఖ్యాక స్త్రీరత్నములు ప్రాచీనకాలమున మన భారతవర్ష మున దర్శితము.

ఋషభునిచే స్థాపితమగు జైనమతమునగూడ స్త్రీల సన్న్యాసస్వీకరణము గానవచ్చుచున్నది. ఆస్త్రీసన్న్యాసినులు

బరివ్రాజిత లనెడివారు. వర్ధమాన మహావీరుని కాలమున జైన మతము మిక్కిలి అభివృద్ధిగాంచి, మహావీరుని శిష్యులలో బరివ్రాజితలు 36000 ఉండినట్లుగ జరిత్ర.

పై వచింపబడినట్లు జైనమతమునమాత్రమే కాక, లోక బాధల గాంచి, హృదయము తపింప, శాశ్వదానందమును తాను పొంది, ఆ యానందమున సర్వమానవాళి నుంప దీక్షగొని, అద్దానికై విశాల సామ్రాజ్యమును, ముదుసలి జనకుని, నవ యౌవనవతియగు భార్యను, పసిబిడ్డను, సమస్తసుఖముల బరిత్యజించి, 'సంగం త్యక్త్వా సుఖం వ్రజేత్' సంగమును త్యజించి సుఖమును బొందవలయునను ఆర్యోక్తివిధాన సర్వ సంగముల ద్రోసి, అరణ్యముల వసించి, ఆహారనిద్రాదుల విస్మరించి, తీవ్రతపస్సు గావించి, బుద్ధత్వమును సాధించి, అహింసా జ్యోతిని వెలిగించిన బుద్ధభగవానుని బౌద్ధమతమునను అనేక మంది స్త్రీసన్న్యాసినులు గోచరము. వీరు భిక్షుణీ లనబడుదురు. మగధరాజు బింబిసారుని ధర్మపత్నియై, బుద్ధభగవానుని ముఖతః సాంసారికదుఃఖముల శ్రవణము జేసి, హృదయము పరివర్తనము చెంది విరాగ మంకురింప, భర్త్రు యనుజ్ఞగొని సన్న్యాస స్వీకరణ మొనరించి, బుద్ధు నాశ్రయించి, బౌద్ధధర్మపాలనము జేయుచు, బుద్ధుని అగ్రశ్రావికలలో బ్రముఖస్థానము వహించి, బుద్ధుని దక్షిణమున నాసీనయగు సద్ఘ్యాత బొంది, 'దక్షిణహస్త శ్రావికగా' క్షేమయను మహారాజ్ఞి ప్రఖ్యాతి నొందెను. అట్లే శ్రావంతీనగరమున నొక ధనికునికి అతిసౌందర్యవతియగు ఏకైక పుత్రికగా జన్మించి, ఆ సౌందర్యమును దిలకించి రాజాధిరాజులు ఆమెను వివాహమాడ ఆమె జనకుని చెంత గరుదెంచుటయు

ఒకని కిచ్చి వివాహముజేయ దదితరులు పోరాటముల మగ్గుదు రని ఆమెతండ్రి దీర్ఘముగ యోచించి,బౌద్ధసంఘమున జేరి విషయముల నతీతింప నామెకాజ్ఞ నిడుటయు,నంత నామె బుద్ధుని శరణుజొచ్చి,బౌద్ధమతధర్మముల సక్రమలీల నాచరించి, అగ్ర శ్రావికయై,బుద్ధుని వామపార్శ్వమున నాసీనయగు అధికారము నొంది, 'వామహస్త శ్రావిక'యై చెల్వొంది, తపస్సు గావించు కొనుచు, భిక్షాటనము జేయుచు సుప్రఖ్యాతయై వెలుగొంది నది ఉత్పలవర్ణ యను నొక వనితారత్నము. మరియు, నొక కోటీశ్వరుని ధర్మపత్నియై, ఏకైకపుత్రుని మరణవేదనను భరింప జాలక బుద్ధుని జేరి బిడ్డను బ్రతికింపుమని ప్రార్థించెను. కాని మరణించినవారు తిరిగి జీవింతురా ? అయినను భగవానుడు సర్వప్రపంచము నశ్వరమేయని బోధించు నుద్దేశమున నామెను వీక్షించి 'అమ్మా, దుఃఖవిదూరమగు స్థలమున జేరెడు తిలల గొని రమ్ము. వానిచే నీ బిడ్డను సజీవునిగ జేయగల' నని పలికి ఆమెను వెనుకకుబంపెను. ఆమెయు వల్లెయని ప్రతిగృహమున నీవిషయమును దెల్పుచు, వారిచే సర్వము దుఃఖమయముగా గ్రహించి, సర్వమమకారముల ద్రుంచి, 'ప్రేమతో జాయతీ శోకో ప్రేమతో జాయతీ భయం। ప్రేమతో విప్పముత్తస్స నత్థి శోకో కుతో భయం॥' ప్రేమనుండియే శోకభయము లుత్పన్న ములు. ప్రేమనుండి విముక్తుడగువానికి శోకములేదు. ఇక భయమెచ్చట ? అను శ్రీ బుద్ధదేవుని ఉపదేశసారమును హృదయమున బదిలపరచి, బౌద్ధమతావలంబినియై, భిక్షుణియై తనరినది కిసాగౌతమి యను నారీమణి. ఇంకను ఎందరో స్త్రీలిట్లు బౌద్ధమతమున నలరారియుండిరి.

ఈ విధమున ప్రాచీనగాలమున మాత్రమేగాక నాధునిక కాలమునగూడ దమ ధీశక్తిచేనేమి, తమ పవిత్ర తేజోపుంజముచేనేమి పెక్కండ్రు వనితామణులు సమస్తప్రపంచమును ప్రకాశితమొనర్చుట విదితము. 'తన్యతే విస్తార్యతే అనేనేతి తంత్రం' రక్షించు జ్ఞానమును వ్యాపింపజేయునది తంత్రము అను వ్యుత్పత్తివిధానమున, నట్టి అరువదినాలుగు తంత్ర శాస్త్రముల సారమును గ్రహించి, సాధించి, అనుభవించి, దానిని లోకమున జాటుటకు సర్వశక్తియగు కాళికాదేవి యాజ్ఞంగొని, సర్వప్రదేశముల గ్రుమ్మరుచు, దక్షిణేశ్వరమున కేతెంచి, బ్రహ్మచర్యవ్రత నిష్ఠాగరిష్ఠుండును, లోకమాన్యుండును, జితేంద్రియుండును, పరమహంస చక్రవర్తియు, గామకాంచనాతీతుండును, అగు శ్రీరామకృష్ణదేవున కుపదేష్టయై, తంత్రార్థముల బోధించి, వైష్ణవచరణ గౌరీపండితాది మహావిద్వాంసులుగల సభారంగముల శ్రీరామకృష్ణు డవతారశ్రేష్ఠుడని ఎలుగెత్తిచాటి, వేదాంతపతాక నెగురవైచినది యోగినియు, సన్న్యాసినియు నగు భైరవీబ్రాహ్మణీ గిరి. మరియు శిబ్‌పూర్ నివాసియగు పార్వతీచరణ ఛటోపాధ్యాయ, గిరిబాలల గర్భవాసమున జన్మించి, సకల కళాయుక్తడగు శ్రీకృష్ణభగవానుని ఇష్టదైవముగ నెంచిన మృడాని యను బాలిక, పసితనమునుండియే అంతరమున అవ్యక్త సంస్కారములు మొలకలెత్త, 'అధ్యాత్మవిద్యా విద్యానాం' అను గీతోక్తివిధాన ఆధ్యాత్మిక విద్యను ఉత్తమముగా బరిగణించి, త్యాగ మభివృద్ధి చెంద, ద్వాదశవర్ష ప్రాయమున వివాహము నొల్లక 'విషీణ్వంతి బధ్నంతీంద్రియాణీతి

విషయాః' ఇంద్రియముల బంధించునవి విషయములు అనురీతి 'విషసర్పంబుల కౌగలింత లివి' యనునట్లు విషయసుఖముల కాశింపక, శాశ్వతానందమున విహరింపగోరి, గృహము బాసి, యరణ్యముల గ్రుమ్మరి, తపం బొనర్చి, సన్న్యాసాశ్రమ మును స్వీకరించి, సర్వశక్తి స్వరూపిణియగు పార్వతీదేవి శక్తి సామర్థ్యముల గ్రహించినదో యనునట్లు 'గౌరీమాయి' యను నూత్న నామమును అలంకరించి, యిరువదియైదవ వత్సరప్రాయ మున శ్రీరామకృష్ణు నాశ్రయించి, శ్రీశారదామాయిసన్నిధాన మున వసించియుండుచు, శ్రీశారదామాయినే యాదర్శముగ స్వీకరించి, యామె పేర 'శ్రీ శారదేశ్వరీ ఆశ్రమము' అను నొక స్త్రీలమఠమును కలకత్తానగరమున స్థాపించి, అందు అనేక స్త్రీలకు విద్యాశిక్షణముల నొసంగి, సన్న్యాసమును సైతము నిడుచు, స్త్రీయధికారమును ఆమె లోకమునకు వెల్ల డించెను. ఆశ్రమ స్థాపనమేకాక ఆమె దేశముల బర్యటించుచు, ఉపన్యాసముల నొసంగుచు సుప్రఖ్యాతి గడించినది.

ఆమె ధైర్యస్థైర్యములకును, త్యాగమునకును, పవిత్రత కును మెచ్చి, ఆనందించిన శ్రీరామకృష్ణ పరమహంస దేవుడు తాను ఏ భక్తుని గృహమునకు వెడలినను తనవెంట శ్రీ గౌరీ మాయిని దోడ్కొని అరుగుచుండెడివాడు. అంతియగాక 'గౌరీమాయి యీ విధముగా వచించిన' దని ఆమె వాక్య ముల దన ప్రసంగముల ప్రమాణయుక్తములుగ నుదాహరించు వాడు. ఆమెనుగూర్చి If a woman becomes a Sannyasini she is no longer remains a woman ఒక స్త్రీ సన్న్యాసిని

నైయిన-చో నిక ఆమె స్త్రీవ్యక్తి కాదని సగర్వముగ బలికెడి వాడు. శ్రీ శారదామాయియు గౌరీమాయి నత్యధికముగ ప్రేమించుచు, ఆమె ఒనర్చు సర్వకార్యములకు సలహాల నొసంగుచు, సన్న్యాసమునుగూర్చిన ప్రసంగమున 'గౌర్దాసిని ఉదాహరణముగ గ్రహింతము. ఆమె స్త్రీయా? ఆమె పురుషుడు. ఆమెనుబోలు పురుషు లెందరుగలరు?' అని గౌరీమాయినిగూర్చి పల్కుచు నానందించెడిది. పై వచించిన చందము శ్రీ శారదారామకృష్ణు లిర్వురిచే నంత ప్రేమింపబడి, వారి యాశీస్సుల నందిన ఆధన్యజీవి గౌరీమాయి నిజముగా ధన్యయే. Sannyasi is a world teacher సన్న్యాసి జగద్గురువు అను శ్రీ రామకృష్ణ వచనరీతి ఆమె స్త్రీ యయ్యును జగద్గురు స్థానము నలంకరింప సర్వసమర్థయై వెలుగొందెను.

ఇంతియేగాక పూర్వము వచించినచందము యోగినులకే ఆదర్శమై, శ్రీరామకృష్ణదేవుని వ్యావహారిక సహధర్మచారిణియై, ఆరాధ్య దేవతయై, ప్రేమస్వరూపిణియై, ఆధ్యాత్మికగగనమున విహరించుటకు స్త్రీయోగ్యతను బ్రదర్శించి యాదర్శమూర్తియై, సర్వాధ్యాత్మికానుభవములకు బవిత్రతయే మూలమని చాటుచు, సర్వ సగుణ నిర్గుణానుభవముల బొంది, సర్వ లోకప్రపూజ్యయై చెల్వొందె, 'పవిత్రం చరితం యస్యాః పవిత్రం జీవనం తథా। పవిత్రతా స్వరూపిణ్యై తస్యై దేవ్యై నమో నమః ॥' అనురీతి బవిత్రచరితముననే గాక, బవిత్రజీవనమునను నాదర్శయై, మరియు పవిత్రస్వరూపిణియునై వెల్గొందె, గృహస్థులకును సన్న్యాసులకును పరమాదర్శయై యొప్పారు

శ్రీశారదామణీదేవి నేటి ప్రపంచమున సర్వులకు వందనీయయై విరాజిల్లుచున్నది గదా! ఎట్టి జీవిత మహిమచే నీమె సర్వాదర్శయైనదో, దర్శన స్పర్శన వచన భావనములచే పవిత్రప్రేమమున నెట్లు ఈమె సర్వహృదయ పరివర్తన మొనరించెనో, కూపస్థ మండూకములమాడ్కి ప్రపంచమున సర్వాహంకార మమకారబద్ధులయ్యును మోక్షమును కాంక్షించు ముముక్షుకోటి కెట్టి యుపదేశరత్నముల నొసంగెనో యిక ముందు గ్రహించెదముగాక!

## అవతరణము

'పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం।
ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే ॥' సాధు రక్షణము దుష్ట శిక్షణముల కొరకును, ధర్మస్థాపనార్థమును నేను ప్రతియుగమునందును జనించుచుందునను గీతాకారుడగు శ్రీకృష్ణపరమాత్మ వచనసరణి రామ కృష్ణ బుద్ధ శంకర చైతన్యాద్యవతారములు పెక్కు స్పష్టము. కాని 'అపకారిషు యః సాధుః స సాధుః సద్భిరుచ్యతే।' అపకారము గావించువారి యందు ఎవడు మేలు నొనరించునో వాడు సత్పురుషుడని సత్పురుషులచే వచింపబడినట్లు శ్రీ శారదాదేవి యవతారము మాత్రము సాధురక్షణమే గాక దుష్ట రక్షణము గూడ చేయు తలంపుతో నావిర్భూతము. హంతకులైనను లేక కేవల పాతకులైనను ఎట్టి దుష్టపథానువర్తులైనను, వారి సంతతమును [illegible] మాతృప్రేమచే [illegible]ంచిన యనురాగ

ముతో దరికిజేర్చి తన యనుంగు బిడ్డలగు శిష్యులతో సమముగ జూచునుగదా ! అందుచే దుర్మార్గులని ప్రపంచమున వక్కాణింపబడుచున్న వ్యక్తులుగూడ సర్వము మంత్రగానికి వశమగు రీతి, నామె పవిత్రసన్నిధానమున నా స్వార్థరహిత నిష్కళంక ప్రేమకు దాసానుదాసులై యావజ్జీవము నామె పాదపద్మముల విడువనొల్లక, ఆ పరమాదర్శక జీవితవిధానముల దాముగూడ నాచరించి సత్పురుషులై చెలంగిరి యన నయ్యది అద్భుతము, అపూర్వమునై యున్నదిగదా! ఆమెయొక్క అనంత అఖండ ప్రేమ మూర్తులనుగూడ ఎట్లు మార్చెనో ముందు చూచెదము గాక ! ఇట్టి యపూర్వ ఆదర్శప్రేమస్వరూపిణి యామెయే యనిన నిక నామెం గన్న మాతాపితలు ఎట్టివారలోగదా ! అవును, తల్లి దండ్రులబట్టియేగదా బిడ్డల బుద్ధిప్రవృత్తులు! కాన నామె వంశమును, తలిదండ్రుల విషయమునుగూడ గ్రహింప నవసరమేగదా! రాముని గనిన కౌసల్యయు, కృష్ణుని తల్లియగు యశోదయు, రామకృష్ణుని గనిన చంద్రామణియు, వివేకానందుని గనిన భువనేశ్వరియు సర్వప్రపంచము నుద్ధరించు మహావ్యక్తుల నొసంగి, తమ జీవితముల ధన్యమొనరించుకొనుటయేగాక, సకలమానవకోటియొక్క ముక్తికి సహాయభూతులై తమ నామధేయముల నాచంద్రతారార్కముగ ప్రకాశింప జేసికొనిరి. అట్లే భగవంతుని మాతృప్రేమ మూర్తిని దాల్చి, సర్వులచే పవిత్రమాతృదేవి యని పిలువబడుచు శ్రీ శారదామణీదేవి యని వ్యవహరింపబడుచున్న జగజ్జనని గనిన దల్లిదండ్రుల భాగ్యమే మహాభాగ్యముగదా! వారు ముమ్మాటికి ధన్యులు ! ధన్యులు ! ధన్యాతిధన్యులు ! అట్టివారిచే 'కులం

పవిత్రం జననీ కృతార్థా వసుంధరా పుణ్యవతీ చ' వంశము పవిత్రమై, తల్లి కృతార్థయై, భూదేవి పుణ్యవతియగు ననునట్లు మన శారదాదేవిచే సర్వము పునీతమై యొప్పినది.

భారతావనిలో ప్రథమనగరమని పరిగణింపబడి కాళీ ఘట్టమనియు గలకత్తయనియు నాబడు నగరమునకు బశ్చిమ దిశను అరువదిమైళ్లదూరముననున్న జయరామవటి యను నొక కుగ్రామమే శ్రీశారదాదేవి జన్మభూమి. నాడు ప్రయాణసౌకర్యములకు దూరమైనను, నేడు ఏకొలది సౌక ర్యముల గల్గియున్నను 'జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీ యసీ' జననీ జన్మభూములు స్వర్గముకంటె నధికము అను సూక్తివిధాన నీజయరామవటి నాబడు గ్రామమే శ్రీశారదా దేవి జన్మస్థానమగుటచే, నేడు క్షేత్రరాజమై యాత్రికులకు కేంద్రస్థానమై యలరారుచున్నది. ఆమె ఖ్యాతి ప్రపంచ వ్యాప్తినొందుటయే దీనికి గారణమని విదితము. మరియు, పవిత్రతచేతనే యెట్టి నిరోధములులేక నాధ్యాత్మికగమ్యమగు మోక్షసామ్రాజ్యము నధిష్ఠింపవలయునను శ్రీమాతృదేవి యుపదేశమును సూచించుచున్నదో యనునట్లు ఆమొదార్ యను నది స్వచ్ఛమై నిర్మలమై నీగ్రామమునకు ఉత్తరదిశగా బ్రవహించుచున్నది. అట్టి పవిత్ర నదీతలమునగల యీగ్రామ మున, రెండు బ్రాహ్మణకుటుంబములలో నొకటియగు ముఖో పాధ్యాయ కుటుంబమున శ్రీశారదామణి జనించెను. ధర్మరతు డును, దానశీలుడును, సత్యపథానువర్తియు, మహాభక్తుడును, నిష్కపటియునగు రామచంద్ర ముఖోపాధ్యాయ యను ఆర్యు నకును; పవిత్రశీలయు, పతిభక్తియుక్తయు, కపటదూరయు,

సర్వుల దననిష్కళంక ప్రేమచే ప్రపూత మొనరించునదియునగు శ్యామసుందరీదేవి యను కాంతాతిలకమునకును నామె జన్మించెను. కాలక్రమమున శ్రీశారదామాయియొక్క శిష్యకోటిలో నెవ్వరైన తనవద్ద కరుదెంచినచో నా వృద్ధ శ్యామసుందరి తన కన్నబిడ్డలమాడ్కి వారి నాదరించెడిదట. ఆమెనుండియే ఆ ప్రేమవాహిని మన శారదాదేవియందు ప్రవేశించి అధికతర విశాలమై సర్వప్రపంచము నావరించినది యని విదితము. ఇక శ్రీ శారదా జననవిషయముగూడ నత్యద్భుతము. శ్యామసుందరి యొకపర్యాయము సమీపగ్రామమగు శిహోరికి నుత్సవసందర్భమున వెడలి యట దేవాలయసమీపమున నొక వృక్షచ్ఛాయ నాసీనయై యుండెను. ఆ సమయమున, నామెకు రక్తవర్ణవస్త్రముల ధరించి యైదారు వత్సరముల రూపసియగు బాలిక యొకర్తుక కనుపించి, తన మృణాళనాళికలబోలు కోమల హస్తద్వయముచే సుందరీ కంఠమును గాఢాలింగనమున జేర్చి, ముద్దులమూటగట్టు మృదుమధుర వాక్యములతో 'అమ్మా! నేను మీగృహమున కరుదెంచితిని' యని పల్కుచు నామె శరీరమున ప్రవేశించెను. అంత శ్యామసుందరియు స్పృహదప్పినదై కొంతకాలమునకు దెప్పిరిల్లి ఆశ్చర్యము నొందెను. ఈ సంఘటనము జరిగిన బిమ్మట 1853 వ సంవత్సరమున డిశంబరు యిరువదిరెండవ తేది యనగా ప్రమాదీచ నామ సంవత్సర మార్గశిర బహుళ సప్తమీ గురువారమున శ్రీశారదామాయి జనించి వారి గృహమును, సర్వ ప్రపంచమును బునీత మొనరించెను.

ఇట్లు కేవల కారణజన్మమును నొందిన మన శారదా దేవి పసితనమునాదిగ దన దేవత్వమును దరచు వ్యక్తము గావించుచు నాజయరామవటీ గ్రామమున నెల్లర కల్లారుముద్దు బిడ్డగా దనరి దినదిన ప్రవర్థమాన యగుచుండెను. ఈమె చిన్న నాటినుండి దేవతామూర్తులగు కాళి, లక్ష్మి, సరస్వతీ మున్నగు దైవముల బూజించుచుండెడిది. భావికాలమున సర్వులకు మాతృమూర్తికానున్న మన శారదయందు ఆ మాతృత్వశక్తి అంతర్గతమై, ఆ యా సమయముల వ్యక్తమగుచుండెడిది. కాన ఆటపాటలందును ఆమె తల్లిగ వ్యవహరించెడిది. అవును, కుసుమ సౌరభము మొగ్గయందును అంతర్గతమై, వికసిత పుష్పమున నది అధికమైనటుల నా జగన్మాతృత్వము బాల్య మునసే మన శారదయందు అవ్యక్తమై క్రమముగ నది వెల్లువ అగుటయం దాశ్చర్యమేమి ? అందువలన నొక పర్యాయ మొక శిష్యుడు శ్రీ శారదాదేవితో సంభాషించుచు 'అమ్మా ! మిమ్ముల నేను 'అమ్మా' యని సంబోధించుచుంటిని కదా ! నిజముగ మీరు నాకు తల్లియా' అని ప్రశ్నింప, జితునవ్వు ముఖమున నర్తనము సల్ప, మాతృత్వ ముప్పొంగ, సర్వ చరాచరభూతకోటికే మాతృదేవతయై వెలుగొందు నాశారదా దేవి పసిబిడ్డను బుజ్జగించు కన్నతల్లివోలె ప్రేమతో 'అవును, నేను నీ స్వంత తల్లినే' అని యథార్థమును వ్యక్తముజేయు చున్నదో అనునట్లు సమాధాన మొసంగెను. అది సహజమే గదా ! జన్మ పరంపరలలో మునుగుచు, అనేక తల్లులను గాంచుచు, వారలే యథార్థమగు తల్లులుగా భ్రమించువారికి యథార్థమగు జగన్మాతను గ్రహించుట దుస్సాధ్యము గదా !

సర్వదేవతలును తన కళాస్వరూపులే యైనను 'యద్యదాచరతి శ్రేష్ఠ స్తత్తదేవేతరో జనః। స యత్ప్రమాణం కురుతే లోక స్తదనువర్తతే॥' అని గీతావాక్యము బోధించునట్లు, ఉత్తముల యాదర్శములే లోకమునకు ఆచరణీయములు కాన తాను అర్చనావిధానమును జూపుచుండెడిది. మరియు జగద్ధాత్రి పూజా దినములలో నొక్కనాడీబాలిక తన్మయత్వమున నిశ్చలతమునిగి యానందించెను. లోకమాత యగు నీబాలిక తనయందనుభూత మగు సమాధుల గొలదిగ నాడే లీలామాత్రముగ నాటి వారికి గోచరింపజేసెనేమో !

## ప రి ణ య ము

ఇక శారదాదేవి విషయము నిట కొంచెము నిలిపి, శ్రీ శారదామాయిని యుత్కృష్టస్థితిని బొందింపజేసియు, నీమె యాదర్శముల గ్రహించి తదనుగుణ శిక్షణ మొసగించియు, నఖిలజగత్తునకు బవిత్రమాతృరూపిణిగ నీమెను రూపొందింప జేసియు, వ్యావహారికముగ భర్తయయ్యు భార్యను తన మాతృదేవిగ నవర దేవతాస్వరూపిణిగ నవలోకించి 'త్యక్త్వాతిదూరం కనకం చ కామినీం రరాజ యో సావకలంక చంద్రవత్' ఎవడు కామకాంచనముల నతి దూరీకృతము గావించి, నిష్కళంక చంద్రునివలె ప్రకాశించెనో అను చందమున కామకాంచనవిజయుడగు శ్రీ రామకృష్ణదేవుని గూర్చి యిసుమంత నిక గ్రహింప వలయును.

జయరామవటికి నాలుగు మైళ్ళ సమీపమున గామారి పుష్కరిణి యను గ్రామమున క్షుదీరామచటోపాధ్యాయ చంద్రామణీదేవియను పుణ్యబ్రాహ్మణ దంపతులుండిరి. ఏతద్వంశభూషణుడగు పుత్రుడుగ 1836వ సంవత్సరమున శ్రీ రామకృష్ణ దేవుడు జన్మించి, పొట్టకూటివిద్యల కాశింపక, నపరవిద్యను త్యజించి, 'ఏక విజ్ఞానేన సర్వవిజ్ఞానం భవతి' ఒక్క విజ్ఞానముచే సర్వ విజ్ఞానములు ప్రాప్తించును యను శ్రుతిరీతి బరావిద్యను బొంద నభిలషించి, 'తేన త్యక్తేన' త్యాగముచేతనే నా పరావిద్య యగు బ్రహ్మవిద్య సాధ్యమనియు, మరియు నది 'న కర్మణా న ప్రజయా ధనేన త్యాగే నైకే—' అను శ్రుతిచందము కర్మ సంతాన ధనములగాక ఒక్క త్యాగముచేతనే సాధ్యమనియు గ్రహించి, 'తపస్సంచయ ఏవాసౌ విశిష్టో ద్రవ్యసంచయాత్' ద్రవ్య సముదాయముకంటె దపోసంచయమే విశిష్టమనియు నిర్ణయించి, కలకత్తాకు నాలుగుమైళ్ళదూరమున రాణీరాస్మణీ యను నారీరత్నముచే నిర్మింపబడిన, సర్వసృష్టిస్థితిలయ కర్త్రి యగు శ్రీ కాళికాదేవి యాలయమున నర్చకపదవిని స్వీకరించి, అనవరతము నా దేవి నలంకరించుచు నర్చించుచు, గీర్తించుచు ధ్యానించుచు, దర్శనాకాంక్ష దపించుచు 'నిస్పృహస్య తృణం జగత్' అను విధంబున ప్రపంచమును అల్పముగ వీక్షించుచు, అహర్నిశల తపోనిమగ్నత మైమరచుచు, దేవీ దర్శనభాగ్యము నకై తల్లిబాసిన పసివానిచందము విలపించుచు శ్రీ రామకృష్ణ దేవుడు దన యిరువదినాల్గవయేట దక్షిణేశ్వరమున నుండెను. తన కొమరునకు బిచ్చిపట్టినదని చంద్రామణీదేవి మాతృ హృదయము పరితపించినదై వివాహము గావించిన వ్మైర్రి

నశించునని నిశ్చయించెను. ఆహా! అద్భుతముకదా యీ విషయము! 'బాలోన్మత్త పిశాచవత్' అనునట్లు మహా పురుషులు, బాలురు ఉన్మత్తులు పిశాచముల వోలె జరించు చుందురుగాన, అట్టిస్థితినుండి లోకమునకు వెర్రిగాదోచు నా పిచ్చిరామకృష్ణుడే యికముందు ప్రపంచమున సర్వమానవు లకు బిచ్చి గుదుర్చు భవరోగనాశక భిషగ్వరుడని యా పిచ్చి మాతృదేవియగు చంద్రామణికి దోచలేదేమో! అవును, పుత్రమమకారముచే నట్టి యద్భుతలీలల యశోదయు, కౌసల్యయు నేమి గ్రహించియుండిరో, అంతియ చంద్రా మణియు గ్రహించినది. అట్లు చంద్రామణి కుమారునకు వివాహము సేయ గోర 'న మాతుః పరదైవతం' తల్లి కంటె నన్యదైవము లేదనియు, 'మాతృదేవో భవ' జనని దేవతయే యగుననియు, 'మాతా గరీయసీ' మాతృదేవియే ఎల్లరకంటె గొప్పదియనియు, సమస్త స్త్రీలోకమును మాతృరూపముగ జూచు రామకృష్ణుడు తన తల్లియాజ్ఞను మీరక, జయరామ వటిలో దనకై నిర్ణీతమైన కన్యక రామచంద్ర ముఖోపాధ్యాయు నింటగలదనియు, విచారింపుడనియు దెలిపెను. ఆ విధముగ వారు విచారించి, ప్రపంచమననేమియో, వివాహమననేమియో యెరుగని అయిదేండ్ల పసిబాలికయగు మన శారదామణిని రామకృష్ణునకు వివాహము గావించిరి. వరునకు నిరువదినాలుగు వత్సరములు, వధువునకు నైదువత్సరములు. ఆశ్చర్యము! అపూర్వము! ఎటనుండి యరుదెంచె నీ సమాగమము!

దీనికి బూర్వ మొక సంఘటనముగలదు. శ్రీ శారదా దేవికి మూడేండ్లప్రాయమున, సమీపమునగల శిహోర్గ్రామ

మునకు దేవతాయుత్సవ సందర్భమున శ్యామసుందరి వెడలి యుండెను. అచట నామె బాలశారదను అంకమున నిడుకొని కూరుచుండియుండ, చుట్టునున్న స్త్రీలు పరిహాసమునకు మార్గ మున బోవుచుండు బాటసారుల నొక్కొక్కర శారదకు జూపుచు 'శారదా, ఇతనిని పెండ్లియాడెదవా ? ఆ ముసలివాని చేసికొనెదవా' అని ప్రశ్నించుచుండుటయు, నా బాలిక అంత వరకు జూపిన వారి నెవ్వరిని వరింపనని తలయూపుచుండ, నదేసమయమున శ్రీ రామకృష్ణుడు పూర్వమువచించినరీతి దక్షిణేశ్వరీ దర్శనాసక్తుడుగాన ధూళిధూసరితశరీరుడై, బాహ్య దృష్టిలేక నా మార్గమున బోవుచుండ, మరల నా స్త్రీలు అతనిని జూపి 'శారదా, ఆపోవుచున్న పిచ్చివాని బెండ్లియాడె దవా?' యని ప్రశ్నింప, నా బాలికయు బరికించి చూచి, సమ్మతిని సూచించుచు శిరమునూపెను. అంత వారందరు, 'పిచ్చివానిని మన శారద పెండ్లియాడు నట' యని నవ్వుచు వెడలిపోయిరి. వారా విచిత్ర సంఘటనను మరచిరిగాని, యీ యిరువురి యపూర్వవ్యక్తుల మనోభావము లేమియో ఎవరి కెరుక ?

ఇట్లు బాల్యమున వివాహితయగు శారదాదేవికి వసతులులేని యాపల్లెటూరిలో విద్య పట్టుబడలేదు. కాని సర్వవిద్యాధిష్ఠానమును బ్రహ్మవిద్యయునగు పరావిద్య ఆమెకు గరతలామలక మగుటచే నామె యీవిద్య నభ్యసింప నిచ్ఛ గింపలేదేమో ! మరియు 'బ్రహ్మవిద్యయా సర్వం భవిష్యంతో మనుష్యా మన్యంతే' బ్రహ్మవిద్యచే సర్వము లభ్యముగ మాన వులు తలంచుచున్నారని యేగదా బృహదారణ్యక వాక్యము.

అయినను కొలదిగ జదువనేర్చినదిగాని, ఆమె వ్రాయ నేర్వ లేదు. ఒకపర్యాయము, శ్రీ వివేకానందుని ఆంగ్లశిష్యురాలైన సోదరి నివేదిత, శ్రీ శారదాదేవి సంతకమును దన పూజా మందిరమందుంచి పూజింప గోరి సంతకమునకై ప్రార్థింప, శారదయు దనకు వ్రాత యలవాటులేమిని దెల్పినను నివేదిత సమ్మతింపనందున, నామె యక్షరముల బలుకుచు వ్రాయ యత్నించెనుగాని ఆ శ్రమ వ్యర్థమయ్యెను. అవును, భగవత్సాక్షాత్కార ప్రాప్తికి, వేదాధ్యయనము శాస్త్రపఠనము కావ్యరచనము లనావశ్యకములు. భగవదనుభూతికి హృదయ పరిశుద్ధతయే ప్రధానముగదా! అందుచేత 'ఓభగవంతుడా నీవు నాకు దర్శనమిమ్మ' అని ఎంతకాలము ఆర్తిలేక నుచ్చరింతుమో, అంతకాలము భగవంతు డగోచరము. హృదయము నుండియే ఆవచనము లెపుడు వెలువడునో నాడే ముక్తి సాధ్యము అని ఏసుక్రీస్తు హృదయ ప్రాధాన్యమును స్పష్టీకరించెను. ఈ హృదయాధిక్యతనే సూచించుచు, 'బాహ్యోచారములగాని, అపక్వాహారములగాని, వనవాసమునగాని కేవల దుగ్ధపానముచేగాని, తృణ భక్షణముచేగాని, స్త్రీత్యాగమువలనకాని జీవితమును గడుపుచున్నను, నీహృదయ పరివర్తనము కలుగనిచో నీకు భగవదానందమెట్లు సంప్రాప్తము' అని శ్రీకృష్ణ తన్మయత్వమున దన కోకిలస్వర గానముతో నెలుగెత్తిపాడినది భక్త మీరాబాయి. 'ఓ ముముక్షువులారా! హృదయ పరివర్తనము గలిగినగాని పవిత్రత లేదు. హృదయ నిర్మలత్వమున్నగాని కైవల్యప్రాప్తి దుర్లభము. కాన నాధ్యాత్మికానంద విహార సౌధమునకు బునాదియగు పవిత్రతను

ప్రథమమునందున నలవరుచుకొనిన సర్వము సాధ్యమే' యని పవిత్రతను ప్రధానముగ నుపదేశింపబోవు శ్రీ శారదాదేవికి నీ విద్య లనవసరమని దోచెనేమో! అట్లని ఆమె విద్యను ద్వేషించి, తన సన్నిధిగలవారిని విద్య నభ్యసింపవలదని ఆదేశించెనని భావింతురేమో, కాని, యామె యట్లొనరింపక 'శ్రోత్రియం బ్రహ్మనిష్ఠం' శాస్త్రజ్ఞానము బ్రహ్మనిష్ఠయు రెండును అవసరమని వారికి బోధించి, వారి విద్యాభ్యాసమున కెంతయో ప్రాధాన్యము నొసంగి యున్నది. అవును, స్వార్థరహితులు శిష్యుల శ్రేయోభివృద్ధినే కాంక్షించి వారి యున్నతికై పాటుపడుదురుగదా!

## సద్గురు చరణసన్నిధి

కాలవాహిని ఎన్నడు ఒకే చందమున నుండదుగదా ! అట్లు కొన్నివత్సరములు తెలియకయే గడచినవి. శ్రీ శారదాదేవి జీవితములో గొన్ని వత్సరములు కాలాంతర్గతములై చక్రమందలి యాకులవలె దొర్లిపోయినవి. ఆమె సుమారు షోడశ వర్షప్రాయమై చెలంగెను. ఆమె తన గృహమున క్షణము బోనీక నెల్లవేళల నేదియొ యొక పనియందు నిమగ్నమై శ్రీ రామకృష్ణ పరమహంసదేవుని యాహ్వానమునకై యెదురు చూచుచుండెను. కాని యామె కంటబడినవెంట, 'అయ్యో, శారదభర్త పిచ్చివాడై దక్షిణేశ్వరమున నున్నా' డని గ్రామవాసులు గుసగుసలు ప్రారంభించిరి. లోకపుతీరు అంతియే గదా! 'గ్రుడ్డిలోకంబు కాకుల గుంపురన్న, మంచికిన్ గోల

చెడ్డకు మించుగోల !' యను విధంబున దన యందున్న దోష ములు గప్పిపుచ్చి యితరుల దోషములు జూపునదియే లోకము. కాన శ్రీశారదాదేవినిగూర్చియు లోకము జాలినొందుట, సంకుచితదృష్టి జూచుటయం దాశ్చర్యమేమి గలదు ? అయి వను సామాన్యులైనచో నట్టి వాక్యములకు బాధజెంది ప్రపం చమును దూషించి, కోపగించు కొందరు కాని, 'యద్యపి రటతి సరోషం మృగపతి పురతోపి మత్తగోమాయుః। తదపి న కుప్యతి సింహః అసదృశ పురుషేషు కః కోపః॥' బలిసినట్టి జంబుకము మృగరాజగు సింహామునుం దెగ్గెత్తి రోషముతో యరచినను, సింహము క్రోధము జెందదు. అట్లే మహాపురు షులయందు కోప మెచట గలదు ? యనునట్లు సుఖదుఃఖ సములగు నిట్టివారిని యీ వాక్యములు చలింపజేయునా ? లేదు.

ఇట్లు కాలము గడువగా 'నా పదునాల్గవయేట గామారి పుష్కరిణిలో శ్రీరామకృష్ణ సన్నిధానమున నేనుండ నన్ను జూచి శ్రద్ధతో నిష్కళంక ప్రేమతో ప్రాపంచిక విధులనుండి పారమార్థిక జీవన విధాన రహస్యముల నేర్పుతో నాకు బోధించిన ఆ పవిత్ర ప్రేమమూర్తికి బిచ్చి యనిన విశ్వసింప దగిన విషయమా ? నే డేదేని మార్పు గలిగియుండునా ? 'పతిర్హి దైవతం నార్యాః' పతియే స్త్రీలకు దైవముగాన గష్టసుఖముల రెండింట దోడ్పడవలసిన హక్కు నాకు గలదు. కాన నాదక్షిణేశ్వరమునకు నేబోయి, యథార్థముగ వా రున్మ త్తులేయైనచో వారిసేవయే నాకు విధి. కాక వారాధ్యాత్మి కానంద మకరందమును గ్రోలుచుండినచో దదనుగుణ్యముగ

నుత్కృష్ట మార్గాను వర్తినినై మెలగెద' నని మన శారద మనమున జింతించెను. ఆ సంకల్పము క్రియారూపము దాల్చిన గదా తన యీప్సితమీడేరుట! 'యథా చిత్తం తథా వాచో యథా వాచ స్తథా క్రియాః। చిత్తే వాచి క్రియాయాం చ సాధూనా మేక రూపతా ॥' సంకల్పానుసారము వాక్కును, వాగనుగుణ్యముగ క్రియయు నుండుచు మనోవాక్కాయము లందు సత్పురుషులకు ఏకత్వము సిద్ధించును అను వచనసరణి త్రికరణశుద్ధియు, బట్టుదలయు, దీవ్రజిజ్ఞాసయుగల శ్రీ శారదా దేవి తన కోర్కెను ఆచరణమున నుంప గృషిసల్పుచుండ, ఆమె యోచనల కనుకూలముగ నా గ్రామవాసులు కొందరు శ్రీకృష్ణచైతన్య జయంత్యుత్సవ సమయమున గంగాస్నానార్థమై కలకత్తకు వెడలుచుండ వారితో దానును బోవలయునని తన తండ్రికి దెలుప, దండ్రియు నామె యుద్దేశ్యమును గ్రహించి 1872 వ సంవత్సరమున బ్రయాణసన్నద్ధమాయెను. నాడు ప్రయాణ సౌకర్యములు లేకుండుటచే వారు కాలినడకన బ్రయాణము సల్పుచుండ, సుకుమారియు, నేనాడును నడక నెరుగనిదియునైన మన శారదాదేవికి మార్గమధ్యమున జ్వర మంకురించెను. అందుచే బ్రయాణమును నిలిపి యొకచో విశ్రాంతి గైకొనిరా పితాసుతలు. నాటిరాత్రి శ్రీ శారదాదేవికి జ్వరము తీవ్రమాయెను. అంత నెనిమిది వత్సరముల ప్రాయ మును, కట్టని దీర్ఘకుంతలయును, నీలవర్ణమును గల యొక బాలిక శారదామణిని జేరి తన మృదుహస్తమున నామెను దాక జ్వర ముపశమించెను. అది గాంచి శారదాదేవియు 'నీ వెవ్వరవమ్మా? ఎటనుండి యరుదెంచితివి?' యని ప్రశ్నింప

నబ్బాలికయు నామెకు సోదరి యనియు దక్షిణేశ్వరమునుండి వచ్చెననియు దెలిపి యదృశ్యమయ్యెను. మరుసటిదినము శ్రీ శారదా దేవి యారోగ్యముగ నుండుటచే, నొక పాలకిని గుదుర్చుకొని వారిరువురు దక్షిణేశ్వరమును జేరిరి. శ్రీశారదా దేవినేగాక సర్వమును మరచి, యఖిలమును శ్రీకాళికాస్వరూప ముగ వీక్షించు శ్రీరామకృష్ణదేవు డామెను ఎట్లాదరించెను ? ఈ విషయమును మనము జూచుచో నాశ్చర్యము కలుగును. శ్రీరామకృష్ణదేవు డామెరాకకు విముఖత్వమును ప్రకటింపక 'వచ్చితివా మంచిది' యని సంతసమును వెలిబుచ్చెను.

అట్లు శ్రీరామకృష్ణునిచే సన్మానితమైన శ్రీ శారదాదేవి స్వచ్ఛమైన మణిచందమున నెట్లు ఆయనసన్నిధానమున మసలి, ప్రవర్తించి ప్రకాశించెనో, ఆ దివ్యదాంపత్యవిధాన మెట్టి పవిత్రత గలదియో చూచెదము. శ్రీ శారదామాయి జీవితమున నిక ప్రథమ విషమ పరీక్షాఘట్టము రానున్నది. ఆ పరీక్షయం దెట్లు మన శారద విజయము గాంచి, సర్వమానవాళి నాశ్చ ర్యానందముల ముంచినదో గాంచెదముగాక ! పూర్వ మే మహాపురుషుని జీవితముననుసంభవింపని కఠినపరీక్షాసమయము. అటులే ఏవ్యక్తియు నిత:పూర్వము తక్షణ మొసంగజాలని పవిత్రదివ్యానుభవ పూరితమైన సమాధానము. అదియే ఆమె పురోభివృద్ధిని సూచించుచు మన కందించు దివ్యసందేశము. అదియే మన హృదయములపై శిలాశాసనముపగిది వెలుగొంద వలసిన అమరవాణి. ఆ సంఘటన మేదియో ఒకింత గ్రహింతము గాక! శ్రీశారదా దేవి దక్షిణేశ్వరమును జేరినంత నొకనాడు శ్రీరామకృష్ణుడామెను జేరబిలచి 'అమ్మా, శారదా! నీ రాక

నన్ను బ్రపంచప్రవృత్తునిగా జేయుటకా? కాక నామార్గావలంబినివై నీ వాధ్యాత్మికానుభవముల నొంది ఆ యమృతము నాస్వాదించి యున్నతానంద శిఖరముల నధిష్ఠించి సర్వప్రపంచమున కాదర్శ మాతృస్థానము నలంకరించుటకా?' యని ప్రశ్నింప, బూవు పుట్టగనే తన సుగంధముల నల్గడల వెదజల్లు చందమున జన్మసిద్ధురాలగు మన శారదామాయి, విషయ వాసనలకు దూరమైన ఆ సాధ్వీరత్నము, చిరునవ్వు మోమున నాట్యమాడ, నిశ్చల దృష్టుల గురుదేవునిపై బరపి, మృదు మధుర వచనముల మెల్లన 'పారమార్థికమార్గమున మీకు తోడ్పడుటకును, యామార్గమున నే నభివృద్ధిగాంచుటకును' అని క్లుప్తముగ జిన్నిమాటల సమాధాన మొసంగెను. ఆహా! ఏమి సమాధానము! తనస్థితిని దానుగ్రహించి, ప్రాపంచికవిషయముల నణగద్రొక్కి, సర్వోత్కృష్టాధ్యాత్మికానుభవసంపదల దుల దూగ నిశ్చయించుకొనిన నామెయొక్క ఆత్మవిశ్వాసమును గాంచుడు. అందుచేతనే, ఆత్మ మార్గ గురు దైవ విశ్వాస చతుష్టయములో, నాత్మవిశ్వాసము తచ్చతుష్టయమున బ్రథమస్థాన మలంకరించియున్నది. అట్టి యాత్మవిశ్వాసము, స్వీయాధిక్యతను గ్రహించుకొనిననాడే కలుగును. చూచితిరా, శ్రీ శారదాదేవి యెట్టి యాత్మవిశ్వాసముగల యాదర్శ వ్యక్తియో!

శ్రీరామకృష్ణదేవుని దివ్యచరణసేవ గావించుచు, దృష్టుల పారమార్థికాభివృద్ధికై బ్రసరింపజేయుచు, ముదుసలియు బ్రేమాస్పదయు శ్రీ రామకృష్ణ దేవుని జననియునగు జంద్రామణీదేవిని తన మాతృదేవిగా నారాధించుచు, నామె

సౌకర్యముల జూచుచు, శ్రీగురుదేవుని యతిసున్నిత జీర్ణకోశము నకు దగు భోజనసదుపాయముల జూచుచు, నప్పటికే శ్రీ గురు దేవు నాశ్రయించియున్న విద్యాధికులును, భక్తి యుక్తులును, సంపన్నులును, నిష్కల్మషహృదయులునగు నరేంద్ర రాఖల కాళీ నిరంజన్ జోగిన్ మొదలుగాగల యువకశిష్య సమూహ ములు శ్రీ రామకృష్ణు నాజ్ఞచే దక్షిణేశ్వరమున నుండుకాల ముల వారికి భోజనాది వ్యవహారముల జూచుచు, నిన్నింట మునిగియు, గుప్తవిధానమున సాధనల జేయుచు, నా దినము లలో మన శారద దక్షిణేశ్వరీ యాలయమున, శ్రీ రామకృష్ణ గురుదేవు సన్నిధానమున దివ్యాధ్యాత్మిక వాతావరణమున మగ్నయై కాలము గడుపుచుండెను. కాని, శిష్యులచేతను, జనసమూహముచేతను అహర్నిశలు శ్రీ రామకృష్ణుడు పరి వేష్టింపబడియుండుటచే నామెకు శ్రీ గురుదేవుని చరణసేవ సేయు భాగ్యము లభింపమిచే నా వంత ఆమె హృదయమును అగ్నివలె దహింపజొచ్చెను. అంత నొకనాడు శ్రీ గురుదేవుని భోజనసమయమున 'దేవా! మీ పాదసేవా భాగ్యము పెక్కురు అనుభవించుచుండ నాకెప్పుడు అవకాశ మిచ్చెదరు? అట్టి పుణ్య మును నాకు ప్రసాదింపు' డని వేడ, శ్రీ రామకృష్ణదేవుడును ఆమెను రాత్రి పండ్రెండు గంటలకు రానవకాశమిడ నామె హృదయము ఉబ్బిగంతులువైచెను. అదేవిధముగ నామె ప్రతి దినము అర్ధరాత్రి గురుదేవుని చేరి రెండుగంటలవరకు పాదసేవ సేసికొనుటయు, అనేక ఆధ్యాత్మికవిషయముల వారినుండి గ్రహించుటయు, శ్రీ రామకృష్ణునికి దరచు వచ్చు వివిధ

సమాధుల వీక్షించి మరల వారికి స్మృతి గలిగించుటయు జరుగుచుండెడిది.

అట్టి సర్వోత్కృష్ట ఆధ్యాత్మికానుభూతుల నానందించుటకు శ్రీ శారదాదేవి తన సాధనావిధానమున విశిష్ట విధానమవలంబించి, అందు సిద్ధత్వమును సాధించి, ప్రపంచాదర్శమై చెల్వొందెను. ప్రథమమున శ్రీ శారదాదేవి శ్రీరామకృష్ణుని సాన్నిధ్యమున మనుచు, శ్రీరామకృష్ణుడు జగన్మాతయగు కాళికా సందర్శనాఫలితముగ సమస్త స్త్రీ లోకమున, సృష్టి స్థితి లయ కారిణియు, ఓంకార స్వరూపిణియు, సర్వమోక్ష ప్రదాయినియు నగు నా భవతరణినే గాంచి, వారిని మాతృదేవతగ భావించుటయు వీక్షించెను. కాని 'కన్నుదోయికి నన్యకాంత లడ్డంబైన మాతృభావన జేసి మరలువాడు' అని ప్రహ్లాదునిగూర్చి భాగవతము వచించినట్లు స్త్రీలను దల్లిగ గాంచుటయందు విశేష మావంతయు నామెకు గోచరింపలేదు. అందుచే శ్రీరామకృష్ణునియందు గల పురుషత్వ భర్తృత్వ ద్వయము నావలకు ద్రోసి, మాతృత్వమును సుప్రతిష్ఠితమొనరించి, శ్రీరామకృష్ణుని జననిగ భావించి ఆనందించుచుండెడిది. తల్లి బిడ్డ సంబంధముచేగాని పవిత్రత కలుగదనియు, నది కలిగినగాని ఆధ్యాత్మకమార్గము సున్నితము కాదనియు నామె దలంచియుండెనేమో! అట్లు శ్రీరామకృష్ణుని దల్లిగ భావించి, తాను సకలప్రపంచమునకు బవిత్ర మాతృమూర్తియై తనరెను. మఱియు సంతతో దృష్టిగాంచక తన ఆధ్యాత్మికాభివృద్ధికి వలయు సాధనాదుల నొనర్చి అనుభవము నొంద సంకల్పించి, నా శ్రీరామకృష్ణదేవునే గురుస్థానమున నుంచి, పారమార్థిక

గమ్యమును సుసాధ్యము గావించుకొనెను. గుర్వనుగ్రహము వినా బ్రహ్మానందానుభూతి దూరమని గ్రహించెనేమో! అట్లు శ్రీరామకృష్ణదేవుని జగద్గురువుగ గుర్తించి తాను జగద్గురువై వెలుగొందెను. పై విధానముచేగూడ దన సాధన సమగ్రము కాదని యెంచి, ఆ దేవత్వము నొందదలచెనో యనునట్లు మరల శ్రీరామకృష్ణునే దేవతాపీఠమున నధిష్ఠింపజేసి, దేవునిగ బూజించి దేవత్వమును బొందెను. మరియు 'ఆదౌ సగుణం' ప్రథమమున సగుణము అనుచందము శ్రీరామకృష్ణదేవుని సగుణమున నారాధించి, 'ఉపాసకః క్రమేణాద్వైత సంస్థానం ప్రాప' ఉపాసకుడు క్రమముగా నద్వైతసంస్థానమును బొందునను త్రిపాద్విభూతి మహానారాయణోపనిషత్తు వచించురీతి క్రమముగా సగుణము నతిక్రమించి, దుర్దర్శమును, గంభీరమును, ప్రసన్నమును అగు 'ప్రజ్ఞానం బ్రహ్మ' అను ఆరూఢస్థితిలో మగ్నమై సమాధిసౌధముల విహరించెను. అట్లు శ్రీరామకృష్ణుని దైవముగ బూజించి, తాను లోకారాధ్యయై చెల్వొందెను. ఇదియే ఆమె అనుసరించిన నూత్న ఆధ్యాత్మిక సాధనా మార్గము.

ఇట్లు కాలముగడువగ యథాప్రకారము శ్రీ శారదా దేవి యొకనాడు తన కోమలహస్తములచే గురుదేవుని మృదు పాదపద్మముల మెల్లన నొత్తుచు 'స్వామీ! నన్నుగూర్చి మీ యుద్దేశ్యమేమి' యని చిన్ని చిరునవ్వుతో బ్రశ్నింప, అర్ధ సమాధిమగ్న హృదయుడగు నా గురుదేవుడు 'సృష్టిస్థితిలయముల సక్రమరీతి నేద్దేవి జేయుచున్నదో, ప్రతిదినము నాచే నీ దేవాలయమున నర్చనల నేద్దేవి గ్రహించుచున్నదో, ఏ

మాతృరూపిణి నవమాసములు మోసి, మోక్షార్హమగు నీ శరీరమును నాకు ప్రసాదించెనో, ఆ దేవియే యీరూపమున నిట నాకు పాదసేవ గావించుచున్నది' అని వెంటనే ప్రత్యుత్తర మొసంగెను. ఆలకించితిరా, వారి సంభాషణా మాధుర్యము! గ్రహించితిరా, యందలి సారాంశము! కనుగొంటిరా, ఆ యపూర్వదాంపత్య విధానము! వారిరువురు అర్థరాత్రియందేకాంతమునం దున్నను, వారిది మాతాపుత్ర సంబంధము. మరియు మాతాపుత్రి సంబంధమైయై యున్నది. శ్రీ రామకృష్ణుడు వ్యావహారికముగ భర్తయైనను బురుషుడైనను, అందుండు పురుషత్వమును వైదొలగించి మాతృత్వమునే నెలకొన జేసికొని మన శారద శ్రీరామకృష్ణుని దల్లిగ జూచెను. ఆహా, తంత్రములుగూడ, సర్వప్రపంచమును శక్తిగ భావించి మాతృరూపమున దర్శింపుమనిగదా బోధించుచున్నవి! 'ప్రపేదిరే ప్రాక్తన జన్మవిద్యాః' హిమగిరిసుతకు విద్యాభ్యాసకాలమున బూర్వజన్మస్థిత విద్యలన్నియు నామెను బొందెను అని కాళిదాస మహాకవి వచించురీతి, తంత్రార్థసారము లీయమకు జన్మతః యలవడి యుండెనుగదా! శ్రీ రామకృష్ణుని మనోభావముల బరీక్షించుటకో, లేక తానే సర్వదేవీస్వరూపమని దృఢనిశ్చయ యగుటకో యనునట్లు గురుదేవు నవ్విధంబున బ్రశ్నించి, యుచిత ప్రత్యుత్తరంబునొంది సంతృప్తిజెందెను.

పై విధానమున, గురుసేవాసందర్భముల శ్రీ రామకృష్ణునకు దరచు గల్గు సమాధుల నామె గాంచుచు, వారిని బాహ్యస్మృతికి దెచ్చుటకు యత్నించి విఫలయై, భయవిహ్వలయై, తెల్లవారుదనుక నొకొక్కసారి మేల్కొని యుండె

డిది. ఇట్లు కొన్ని దినములు ఆమెకు నిద్రయే యుండెడిది కాదు. దీని గురుదేవుడెరింగి ఆమె కష్టమును మాన్పు నుద్దేశముతో, నే యే సమాధి కే యే లక్షణములుండునో, యేవిధముల నా మనమును బాహ్యస్మృతికి దెప్పింపవలయునో మొదలగు అనేక సమాధిరహస్యముల విపులముగ నామె కుపదేశించెను. అట్లు సర్వాధికారములచే జెలొవ్వొందు నామె శ్రీ రామకృష్ణునికి నారాధ్యదేవతయై వారిచే షోడశీనామక పూజనుగూడ స్వీకరింప నర్హాత శ్రీ శారదాదేవి యార్జించెను. అవును, శ్రీ రామకృష్ణభగవానుడే, యుమామహేశ్వర స్వరూపమనియు, నాతడే సకలదేవదేవి మూర్తియనియు, సమస్త మంత్రరూపమనియు, నట్టి యామూర్తిని సేవించిన సర్వదేవతామూర్తుల సేవించినట్లు యనియు శ్రీ రామకృష్ణుని యథార్థస్వరూపమును గుర్తెరింగి గాఢవిశ్వాసముతో సేవించుట చేతనే యట్టి మహోన్నత స్థితుల నామె యధిరోహించెను. దివ్యమైన బ్రహ్మానందానుభూతికి బునాదిగా శ్రీ శారదాదేవి తన పవిత్రతను అభివృద్ధిగావించుకొనుచు, అమృతకిరణ సంపన్నుడగు తారానాథుని దిలకించి 'ఓ చంద్రుడా, నీకైనను కొంచెముగ మచ్చగలదుగాన నా పవిత్ర జీవితమున మాత్ర మిసుమంతయేని కళంకమును రానీయకుము' అని ప్రార్థించెడిది ! ప్రతివ్యక్తియు నట్లు హృదయపూర్వకముగ నద్దేవుని బ్రార్థించుచో నింకేమి కావలయును ? పరమ పవిత్రతాస్వరూపిణియగు నామె కీ ప్రార్థన మెందుల కనెడు శంక గలుగవచ్చును గాని, 'గతానుగతికో లోకః' గతము ననుసరించుటయే లోకపు దీరు గావున, దాము సర్వాతీతులమని

యమ్మాహాత్మ్యలు ప్రవర్తించుచో, నితరులుగూడ యథార్థ మగు ఆత్మానుభూతిని బొందక బూజల ప్రార్థనల, సంకీర్తన ముల జపముల, ధ్యానాదుల గావింపక జెడుదురని గ్రహించి, సర్వుల కాదర్శులై యా దేవదేవుని బ్రార్థించు విధానముల మనపై ప్రేమచే వారు దెల్పుచుండుట సహజమేగదా!

## షో డ శీ పూ జ

ఇట్టి పరమపావనమూర్తియైన మన శారదాదేవి శ్రీ రామకృష్ణదేవునకు జగన్మాతృస్వరూపముగా దోచి నా మహాత్మునిచే నర్చింపబడుటయం దాశ్చర్యమేమి? కాన షోడశీపూజ నాబడు అర్చనయు జరిగినది. ఎట్లన? 1872 వ సంవత్సరము మే నెలలో శ్రీ కాళికాపూజాదినములలో నీ పూజా సంకల్పము. దక్షిణేశ్వరీ దేవాలయము పచ్చని తోరణ ములతోడను, వివిధాలంకారములతో నిండియుండ, ఆలయాధి ష్ఠాన దేవియు సకలాభరణభూషితయై, షోడశవర్ష ప్రాయయై భక్తుల ననుగ్రహించుచున్నదో యనునట్లుండ, నద్దేవిని దర్శించి, నమస్కరించి చైతన్యవంతమగు నా కాళికామాయి తేజోస్వరూపమును గిలకించుచు దన్మయత సంకీర్తనల నొన రించు భక్తసమూహముతో నా దేవాలయమంతయు గిటకిట లాడుచుండెను. అట్టి సుదినమున శ్రీరామకృష్ణదేవుని గది యందు రాత్రి తొమ్మిదిగంటలకు నీషోడశీపూజయు నారంభింప బడెను. శ్రీరామకృష్ణుని పనుపున శ్రీశారదయు నట నుండెను. పూజాప్రారంభమున దేవికై నిర్దేశింపబడిన ఆసనముపై

శ్రీ శారదాదేవి నాసీనగమ్మని గురుదేవుడు గోరెను. అంత విధియుక్తముగ శ్రీ రామకృష్ణుడు శ్రీశారదామాయికి షోడశోపచారముల నొనరించి శాస్త్రోక్తముగ నామెను బూజించెను. పూజ సమాప్తి నొందునప్పటికి నర్ధరాత్రియయ్యెను. అంతదనుక శ్రీ శారదాదేవియు నిశ్చలముగ బాహ్యప్రజ్ఞాదూరమై, సర్వమును మరచియుండెను. అంతమున సద్గురుదేవుడును సమాధిస్థితుడయ్యెను. అట్టు లాపారవశ్యమున నున్న శ్రీ రామకృష్ణుడు కొంచెము బాహ్యప్రజ్ఞనొంది 'సర్వము నీవయే దేవి' యని యామెకు ఆత్మార్పణము గావించి, సర్వార్పణము గావించుటతోడ నా యర్చన సాంతమయ్యెను. ఏమి యీ పూజా విధానము! ఆరాధ్య దేవత భార్యయా! భార్య నర్చించుట లోకమందెచటనైన గలదే? అదియే యందలి రహస్యాతిరహస్యము! నిజముగా, భార్యను భార్యయను దృష్టితో జూచిన మానవుడెవ్వడును అట్లు జేయజాలడు. కాని భార్యయని వ్యావహారికముగ జూచినను, ఆమెయందు లోకైకమాతయగు కాళికనే వీక్షించి, ఆమెను సాక్షాన్మాతృస్వరూపముగ దిలకించి, కామలేశములేని నిష్కళంకహృదయుడైనవాడే యట్లొనరింపగలడు గాని యందరికి సాధ్యముకాదు. సర్వనారీలోకమును మాతృస్వరూపముగ జూచువారికి నే స్త్రీయందుగాని భార్యాదృష్టి గలుగునా? దుర్లభము!

ఇక నిట నర్చింపబడిన వ్యక్తియో కేవల దేవాంశ సంభూతయు, గామపాశములగు నీ సర్వవిషయముల బరిత్యజించినదియు, నిక భావికాలమున శ్రీ రామకృష్ణ గురుపీఠము నలంకరింపబోవునదియు, సూర్యాతప తప్తజీవులకు విశ్రాంతి

నొసగు వటవృక్షమువోలె, విషయాగ్ని పీడిత సమస్త ముముక్షు వుల కాశ్రయమునిడి దరింపజేయు నాధ్యాత్మిక శీతకిరణ శోభి తయు, సహనరూపమున కేవలము భూదేవియేయని ప్రఖ్యాతి గల్గినదియు, పవిత్రప్రేమచే భగవంతుడు సుసాధ్యమని ఆప్రేమను వ్యక్తీకరింపజేయ నవతరించిన లోకైకప్రేమస్వరూపిణియునగు శ్రీ శారదామాయి. ప్రప్రథమముగ నీవిధముగ శ్రీ రామకృష్ణ దేవునిచే నారాధింపబడుట శ్రీ శారదాదేవియొక్క పూజనీయ జీవితమునకు నాందియై వెలసెను. నాటినుండి యనేక సన్న్యా సులచేతగూడ నామె యర్చింప బడుచున్నది. స్త్రీ లోకము నొక్కపర్యాయము పర్యాలోచన చేసిన, బూర్వచరిత్రముల గల సర్వవనితలకుమించిన యర్హతను బొందుటయేగాక, సర్వ సంగవివర్జితులగు యతీశ్వరులచే బూజింపబడుస్థానము యీామె యొక్కతకే దక్క వేరెవ్వరికి నగోచరము. సర్వమును మాతృ రూపముగ దిలకించు నా రామకృష్ణునే 'యాదేవీ సర్వభూతేషు మాతృరూపేణ సంస్థితా' ఏ దేవి సర్వభూతముల మాతృ రూపమున నున్నదో అను సప్తశతీ వాక్యవిధానమున దల్లిగ వీక్షించి, మరల తానే సకలమునకు మాతృదేవియై చెల్వొందు టయే శ్రీ శారదామాయి యిట్టి లోకపూజ్యతను బొందుట యందలి రహస్యము. మాతాశిశువుల సంబంధ మెంత పవిత్రమో గాంచితిరా!

పై విధాన శ్రీ రామకృష్ణుని సన్నిధి సర్వసాధనల సాధించి సమాధ్యవస్థలగూడ ననుభవించుచు, అర్చింపబడు చుండుకాలమున నామెను శ్రీ రామకృష్ణు డొకదినము చేర బిలచి 'నేను చేయవలసిన కార్యముల జేసితిని. ఇక నీవు

చేయవలసినది చాలగలదు. చేయుదువా?' అని ప్రశ్నింప నామె యందులకు మౌనము వహించెను. అర్ధాంగీకారమేమో! సహజ నిరాడంబరమో! గురుదేవుడు అంత నామెకు మంత్రోపదేశ విధానమును దెలుపుచు, నెవరి కే మంత్ర మెట్లుపదేశింపవలయునో మున్నగు పద్ధతుల బోధించెను. అంతియగాక, భావికాలమున దమ నైహికజీవితముల ద్యాగ మయ మొనరించి ఎవరు సన్న్యసింతురో, ఆమెపై నాధార పడుదురో ఆ శిష్యకోటిని శ్రీ రామకృష్ణు డామెకు బరిచ యము జేసెడివాడు. ఆ యువకబృందమునకు ఆహారపానీయ ముల నేర్పరచి ఆమె యాదరించెడిది. ఒకదినము సన్న్యసించిన పిమ్మట అద్భుతానందుడనబడిన లాటు అను శిష్యుడు పంచ వటిక్రింద సాయంసమయమున ధ్యాన మొనరించుచుండ, గురుదేవు డరుదెంచి, 'నాయనా! ఇట ధ్యానము చేయు చున్నావా? నీ ధ్యానాధిదేవత శారద గృహమున కార్య నిమగ్నయై యున్నది. ఆమెకు సహాయ మొనర్పుము' అని శ్రీ శారదాదేవి గొప్పదనమును వారికి బోధించుచు, 'శక్తి జ్ఞానం వినా దేవి నిర్వాణం నోపలభ్యతే।' శక్తిజ్ఞానము లేక ముక్తి అలభ్యమను తంత్రార్థమును శిష్యునకు గురుదేవు డుపదేశించెను. అట్లు శ్రీ శారదాదేవి సర్వానుభవ యుక్తయై, భక్తుల మాతృదేవియై రూపొందిన పిమ్మట శ్రీరామకృష్ణ దేవుడు 1886 వ సంవత్సరము ఆగస్టు 16 వ తేది స్థూల దేహమును వీడి నిర్వాణము నొందెను. తల్లిని బాసిన శిశువుల చందము శిష్యులు విలపింపసాగిరి. మన శారదయు, మిగుల దుఃఖమున శ్రీ రామకృష్ణు సన్నిధికేగి 'అమ్మా, నన్ను వదలి

పోతివా? ఈ బిడ్డను ఎవరికి అప్పగించితివి ? తల్లిలేని పిల్లలనుగ మమ్ముల జేసితివా!' అని యాక్రందించెను. ఏమి యీ పవిత్ర సంబంధము! ఇట్టి సమయమునయైన శ్రీ రామకృష్ణుడు ఆ తల్లి దృష్టికి దల్లియేగదా !

## పారివ్రాజ్యము

శ్రీ రామకృష్ణదేవుని నిర్యాణానంతరము 'పుణ్యక్షేత్రముల బలువురు మహాపురుషులు, సాధుసత్తములు, భక్తులు మొదలగువారు తప మాచరించియుండుటచే, నట పవిత్ర భావములు నెలకొని యుండును. పారమార్థికచింతగలవాడా తీర్థముల గ్రుమ్మరుచునేని తప్పక గొంత పవిత్రతను భగవత్సాక్షాత్కారమును బొందగలడు. కావ నీవును యాత్రాస్థలముల దర్శింపుము' అని పూర్వము మనశారదకు శ్రీరామకృష్ణు డాదేశించియుండుటచే నామెయు యాత్రలసేయ సంకల్పించెను. ఆమెవెంట నరుగ, యోగానంద అభేదానంద, అద్భుతానందులును శ్రీ రామకృష్ణ వచనామృత గ్రంథకర్తయగు మహేంద్రనాథుడును, అతని సతీమణియు గురుదేవుని మేనగోడలు లక్ష్మీదేవియు, గోలప్‌మాయి మొదలగువారు సంసిద్ధులైరి.

'కాశ్యాం తు మరణాన్ముక్తిః' కాశీయందు మరణము వలన మాత్రమే ముక్తియను ఆర్యోక్తి విధానమున బరమపావనమగు గంగాప్రవాహిచే నావృతమై, మణికర్ణిక, దశాశ్వ

మేధ, హారిశ్చంద్రాద్యనేక ఘట్టములతో నలరారుచు, పరమ పూజ్యులును, తపోనిమగ్నులును, సర్వ ద్వంద్వాతీతులును, అవధూతావతంసలు నగు మహాపురుషపంక్తిచే నలంకరింప బడుచు, సర్వవేళల బురాణ దంపతులును, ఆదిదేవులగు అన్నపూర్ణా విశ్వేశ్వరుల దర్శించి, అఘవిదూరులై వచ్చుచు బోవుచుండు యాత్రికసందోహముచే శోభాయమానమై క్షేత్రరాజమై తనరు వారణాసీ దివ్య క్షేత్రమును; ఆధ్యాత్మిక జీవనమునకు త్రికరణము లేకమైనగాని అనుభవవిభూతి దుర్లభ మని బోధించుచున్నదో యనునటుల గంగా, యమునా, సరస్వతీ నాబడు మూడు మహానదుల సంయోగముచే బునీతమై త్రివేణీ నామమున జెల్వొందుచు, త్రికరణముల మనస్సు అంతర్గతమై ఎట్లు అగోచరమో అట్లు యీ స్రవంతీత్రయమునను సరస్వతి అబాహ్యమై అంతర్వాహినియై తీర్థరాజమని పేరెన్నిక గనిన ప్రయాగ పుణ్యక్షేత్రమును; కౌసల్యా దశరథుల ముద్దుల తనయుడై, శిష్టరక్షణ దుష్టశిక్షణాదుల సల్పుచు, 'రామో ద్విర్నాభిభాషతే' రాముడు ద్వివిధముగ భాషింపడు అనునట్లు సత్యవాక్య పరిపాలనాదక్షుడై, 'న రామః పరదారాం శ్చ చక్షుర్భ్యామపి పశ్యతి' రాముడు పరస్త్రీలను గన్నులతో గూడ గాంచడను వచనరీతి ఏకపత్నీవ్రతస్థుడై, ఆదర్శ గృహస్థుగా దనరుచు, దన లోపముల సవరించుకొనుచు, ఆదర్శ పుత్రుడై, ఆదర్శ భ్రాతయై, ఆదర్శ మిత్రుడై, ఆదర్శ రాజచంద్రుడై, ఆదర్శ ఆచార్యుడై, భారతీయ సంస్కృతిలో సర్వాదర్శ మూర్తిగా రాజిల్లుచు, 'రమైతీతి రామః' ఆనందము నొసంగు వాడు రాముడను చందమున దశరథరాము డవతరించిన పవిత్ర

భూమి యగు నయోధ్యానగరమును; హిమవత్పర్వతముల జనించి, ప్రవహించి, నిర్మల తోయముల సమస్తజనుల అఘ నివారణమునకు దీక్షగైకొని, సర్వభేదాతీతస్థితి జరించు సిద్ధుని కైవడి జెలువొందిన పవిత్ర గంగానదీమ తల్లిచే బరివృతమగుట చేతను, కాక హిమాలయ గిరిరాజముల వెలయు బదరీనారా యణుని దర్శనార్థమగు ప్రయాణీకులకు ద్వారమగుటచేతను హరిద్వారమని బేరు ప్రఖ్యాతులనార్జించిన హరిద్వారమహాక్షేత్ర మును; దేవకీ వసుదేవుల గర్భముక్తాఫలమై, నందయశోదల మురి పెంపు పట్టియై, బాల్యమాదిగ దన దివ్యవిభూతుల ప్రస్ఫుట మొనరించుచు, నవనీత అనగా హృదయచోరుడై, అష్టదిక్కుల భార్యలుగా గల్గి, పదహారు వేల కళలను గోపికలుగా గలిగి, యోగయోగీశ్వరుడై, పార్థసారథియై, గీతాప్రబోధకుడై, Blue indicates depth నీలత్వ, మగాధత్వమును సూచించు నను విధాన అగాధ పారమార్థిక జ్ఞానవిభూషితుడై, సన్నిహితుని వలె నొప్పుచు సర్వాతీతుడై గోచరించు నీలమేఘశ్యాముడు, వనమాలాధరుడు, కస్తూరీతిలకోపేతుడు, మురళీనాద విలోలుడు 'కర్షతి యోగినాం మనాంసీతి కృష్ణః' యోగుల మనస్సుల నాకర్షించువాడును, ఫలప్రదము చేయువాడును కృష్ణుడను వ్యుత్పత్తి అర్థమురీతి ఆబాలగోపాలముచే ప్రేమింపబడు శ్రీకృష్ణ భగవానుడు గ్రుమ్మరుచు నాటల నాడిన పరమ పవిత్రదేశ మగు బృందావనమును, వైద్యనాథము మొదలగు పుణ్యభూముల దర్శించిరి.

అన్నింటిలో మన శారద నెక్కువగా నాకర్షించిన పుణ్యస్థలము బృందావనము. అందుచే నామె యందొక

వత్సరము వసించెను. అటగల శ్రీ రాధాకృష్ణ మందిరమున రాధావిరహవేదన శారదామాయికి స్ఫురింప శ్రీ రామ కృష్ణునుండి యెడబాటు ఆమె మనమును గలవరపరుప జాల బాధ నొందెడిది. సదా యేకాంతవాసము నభిల షించియు, యమునాతీర సైకతముల దిరుగాడియు, నందందు గాఢ ధ్యాననిమగ్నతను బొందియు, దీవ్రతరముగ దపస్సు గావించియు, నచట నామె కాలమును వినియోగింప గడంగెను. ఒకదినము శ్రీరామకృష్ణుడట నామెకు దర్శనమిడి 'ఏమమ్మా! ఎందుల కిట్లు విలపించుట? నేను సర్వవ్యాప్తముగ నుంటినిగదా?' అనిపలుక నామె హృదయతాపము చల్లారెను. ఆర్తివలన గదా సాధనజేయుట, వైరాగ్య మభివృద్ధిచెందుట, గురుసాన్నిధ్యము లభించుట, అనుభవానందముల మగ్నత నొందుట! ఆయార్తిచేగదా పూర్వము మనము గ్రహించినరీతి శారదాదేవి గృహమువీడి దక్షిణేశ్వరమున గురుసందర్శనా భాగ్యమునుబొందినది. ఆయార్తిచేతనేగదా శ్రీ రామకృష్ణుడు లోకమాతయగు కాళికాసాక్షాత్కారమును బొంది ఆనందించి నది. ఆయార్తిచేతనేగదా బాలుడగు వేంకటరామన్ శ్రీరమణ మహర్షిగా విశ్వవిఖ్యాతి గడించినది. పైన నిర్వచింపబడిన ఆయార్తిలేనిచో మానవజీవితము వ్యర్థమేకాన 'ఆర్తి లేనట్టి యవకాశ మేలనయ్య'అని ఆర్తిలేక సేవల మవకాశముగల జీవితములు వ్యర్థమని వక్కాణింపబడినది. అట్టి తీవ్రతర ఆర్తిచే మన శారదామాయి శ్రీరామకృష్ణ సందర్శనానందమున నోలలాడెను. 'కృష్ణా! ఇతరుల లోపముల జూచుబుద్ధి నాకు లేకుండునట్లు అనుగ్రహింపుము. పరుల నేనాడు నేను నిందింప

కుందునుగాక!' అనియు నామె ప్రార్థించెడిది. అవును, ఎంత కాల మితరులదోషముల వీక్షింతుమో అంతకాలము మన హృదయమున ద్వేషము నెలకొనియుండును. 'ద్వేష్యం దుఃఖ మిహేష్యతే' ఆ ద్వేషమే దుఃఖముగా మహాభారత వాక్యము. ఆదుఃఖముచే నశాంతి ప్రజ్వరిల్లి జీవితము దుర్భరము అగును. కాన సర్వమును ప్రేమించు మన శారద యితరుల దోషముల గాక వారి సుగుణములనే దిలకించుచు నే ఒక్కరిని ద్వేషింపక అందరిని ప్రేమవాత్సల్యముల గాంచెడిది. బృందావనమున సాధనాఫలితముగ నొకనాడామె తీవ్రధ్యానమగ్నయై సమాధిని బొందె, యెంతకు బహిఃప్రజ్ఞనొందకుంటచే ప్రథమమున యోగినీ మాయియు పిమ్మట యోగానందస్వామియు శ్రీ శారదా మాయి కర్ణపుటంబుల భగవన్నామోచ్చారణము గావించిన గాని బాహ్యస్మృతి యామెకు గలుగలేదు. కొంచెము స్మృతి గలిగిన యంత 'దినుట కేమేని గావలయు' నని యామె పలుక గొన్ని ఫలాహారముల వారిచ్చిరట. శ్రీ రామకృష్ణుడుగూడ గొన్ని సమాధి సమయముల నిట్లొనరించెడివాడని ప్రతీతి. కాన నీమెయు శ్రీగురుదేవు డనుభవించిన నాధ్యాత్మిక సంస్థితుల గరతలామలక మొనరించుకొనుచుండెను. ఇక్కడనే శ్రీరామ కృష్ణుని యాజ్ఞానువర్తినియై యోగానందస్వామికి బ్రప్రథమ ముగ మంత్రోపదేశము గావించెను. జ్ఞానభిక్షను ప్రథమమున మాతృదేవినుండి గ్రహించిన యోగానందుడు ముమ్మాటికి ధన్యుడు. ఇట్లు ఆధ్యాత్మిక సింహాసనము నధిష్ఠించి యిచ్చుటనే సమస్తలోకమునకు గురువుగా వెలుగొందినది మన శారదా మాయి.

ఈ యాత్రలతోడనే శ్రీ శారదామాయి తన పర్యటనను ముగింపలేదు. మరల 1888 వ సంవత్సరమున జనవరిలో శ్రీ రామకృష్ణదేవుని యాజ్ఞానుసారముగ గయాక్షేత్రమునకు వెడలెను. అద్వైతానందునితో బుద్ధగయనుగూడ ఆమె దర్శించెను. అంత గలగత్తకు దిరిగివచ్చి మరల డిశంబరు నెలలో జగన్నాధమునుగూడ ఆమె దర్శించెను. 1894 వ సంవత్సరమున శ్రీశారదాదేవి తన మాతా సోదరులతో మరల బృందావనమును దర్శించెను. 1901 వ సంవత్సరమున శ్రీ రామకృష్ణుని శిష్యులతో జగన్నాధమును రెండవ పర్యాయము ఆమె సందర్శించెను. తరువాత 1909 వ సంవత్సరమున రామేశ్వరయాత్ర సంకల్పించి, మార్గమధ్యమున చెన్నపట్టణమున శ్రీ రామకృష్ణుని శిష్యుడగు శ్రీ రామకృష్ణానందునిచే నాహ్వానింపబడి అచటి శ్రీ రామకృష్ణమఠమున మాసము దినములు వసించి, అనేక భక్తులకు మంత్రదీక్ష నొసంగెను. అంత స్వాములవారితో మధుర, రామేశ్వరములకు మన శారద యరిగెను. రామేశ్వరమున గర్భాలయములోనికి నర్చకులుగాక యితరులు పోవుటకు వీలులేదు. కాని పూర్వము వేదాంతకేసరియై, ప్రాక్ప్రతీచీదేశముల తన వాక్సుధారసముచే నుర్రూతలూగించి, భారతదేశప్రాధాన్యమును మహాత్ముల ప్రశస్తిని జాటినట్టి యతివరేణ్యుడగు వివేకానందుడు రామేశ్వరమునకు జనుటయు, రామనాధపురాధీశ్వరుడు, ఆధ్యాత్మికానుభవసౌధముల విహరించు ఆ యతికులచక్రవర్తికి శిష్యుడై యుండుటచే శారదాదేవికి స్వాగతమొసంగి రామలింగేశ్వరు సన్నిధికి బోవుటకుగూడ నాతడు దగు ఏర్పాటుల గావించెను.

అందుచే మన శారదామాయికి నిత్యము ఆ పరమేశ్వరుసన్నిధి సేవజేసికొను మహదవకాశము లభించెను. అంత నామె బెంగుళూరులో భక్తులకొరకై ఒకదినముండి, రాజమహేంద్ర వరమున నఖండగోదావరిలో స్నానమొనర్చి దాని బునీత మొనరించెను. అట నామె గలగత్తకు జేరెను. మరల1912 వ సంవత్సరమున మూడవపర్యాయము అనేక శిష్యకోటి యను సరింప నామె కాశికి బోయి అట రెండుమాసములు తపో నియతి నివసించెను. అప్పుడే ప్రక్కనగల బౌద్ధక్షేత్రమగు సార నాధమునుగూడ నామె దర్శించెను. ఇటుల సకల యాత్రా స్థలముల దర్శించి తరువాతికాలమునంతటిని శిష్యులకొరకుప యోగించుచు జీవితాంతమువరకు గలకత్తయందే మన శారద గడిపెనని చెప్పనగును.

## తపోదీక్ష

ప్రథమమున మన శారదామాయి బృందావనాది క్షేత్ర వాసము సమాప్తినొందించి కలకత్తకు జేరి, కామారి పుష్క రిణియందే యుండ సంకల్పించుకొనెను. శ్రీ రామకృష్ణగురు దేవుడు, శక్తిస్వరూపిణియు, సకలాధ్యాత్మికానుభవ నిలయయు, సమస్త దేవతా స్వరూపిణియు నగు మనశారదను జేరం బిలిచి, 'శారదా! నా తదుపరి నీకు అన్నవస్త్రాదులకు లోటుండదు. మరియు చిల్లికాసుకైనను ఆశ్రయించితివా వారికి నీసర్వస్వమును విక్రయించినట్లే సుమా' అని యా కామకాంచన త్యాగమూర్తి తన జీవితకాలమునం దెవ్వరిని

యర్థింపక, నిస్పృహుడై చరించుచు, కోటీశ్వరులే పాదా క్రాంతులైనను కన్నెత్తి చూడక 'లక్ష్మీశ్చంచలా' ధనము చంచల మనియు, 'అర్థ మనర్థం' అర్థము అనర్థమని గ్రహించి, ఆస్థితి లోనేయుండి మన శారదకు మహోత్కృష్టోపదేశముగావించెను. యథార్థముగ ప్రపంచమున దుష్పథమున జరించుటకీ కామ కాంచన ద్వయమేగదా కారణము! ఆకామమూలమున శివారాధన తత్పరుడును, మాతృభక్తిరతుడును, తపోసంపన్నుడగు రావణ బ్రహ్మ నశించినట్లుగ శ్రీ మద్రామాయణమును, అటులే కాంచన అనగా ధనాశవలన ధృతరాష్ట్ర సూనుడును, కౌరవా గ్రజుడును, గర్వియు, అహంకారాదిక గుణయుక్తుడగు దుర్యోధనుడు సమూలముగ నాశనమొందినట్లు శ్రీ మహాభారతమును బోధించుచున్నవి గదా! 'ధనమూల మిదం జగత్' ఈ ప్రపంచము ధనమూలమనియు, సర్వానర్థములకు నిదియే మూల కారణమనియు, ధన శృంఖలముల బారిబడక గాంక్షాదూరుడై యుండు నాత్మరతునికి వాని యాత్మబలముచే సర్వము సుసాధ్యమగునని శాస్త్రోపదేశమును, ఆచరణశీలురగు మహాత్ముల ఆప్తవచనములునై యున్నవి. అట్టివారికి సర్వప్రపంచము జోహారు లర్పించుటయం దాశ్చర్య మావంతయును లేదు. 'నిస్పృహస్య తృణంజగత్' నిస్పృహునకు జగత్తు తృణప్రాయ మగుచుండ, నిక గాంచనాదులును దృణసమానములేగదా !

ఆ విషయమును మనస్సునం దుంచుకొని. శ్రీ శారదా దేవి కామారిపుష్కరిణీ గ్రామముననే నివాసమేర్పరచు కొనెను. ఈ విషయమును జననియగు శ్యామసుందరి విని

కుమార్తెను జయరామవటికి యాహ్వానించెను. శారదయు జననికానందము జేకూర్ప బుట్టినింట నాలుగైదు దినములు మాత్రముండి, మరల కామారిపుష్కరిణికే తిరిగియరిగి, సాధనల నొనర్చుచు, అనుభవోపదేశమగు శ్రీ గురుదేవుని వాక్యముల నాచరించు దీక్షతో నన్యసహాయ మపేక్షింపక 'స్వాతంత్ర్యాత్ సుఖ మాప్నోతి స్వాతంత్ర్యా ల్లభతే పరం' స్వాతంత్ర్యము వలన సుఖమును, దానివలన పరమును లభించునను అష్టావక్ర గీతోక్తి విధమున స్వతంత్రముగ దీవ్రతపోజీవితమును గడుపు చుండెను. ఆమె ఏకాంతవాసమున నుండుచు, అనేక కష్ట నిష్ఠురముల సహించుచు, సహనము నార్జించుచు, భావికాల మున నాధ్యాత్మిక గురుపీఠమధిష్ఠించి ప్రపంచమునకు దివ్య సందేశముల నొసంగగల శక్తిగడించుచుండెను. అట్టి యేకాంత జీవిత కాలమున నామె భుజించినదో, లేదో విచారించువారైన నను లేకుండిరి. సామాన్య వ్యక్తులయినచో నున్మత్తులై పోవు దురు. కాని 'దుఃఖేష్వనుద్విగ్నమనా స్సుఖేషు విగతస్పృహాః' దుఃఖములకై బరితపింపక, సుఖములకై సంతసింపని వారు నగు నట్టి మహనీయులు 'యుగాంతే చలతే మేరుః కల్పాంతే సప్త సాగరాః। సాధవః ప్రతిపన్నార్థా న చలంతి కదాచన ॥' యుగాంతమున మేరుపర్వతము కదలవచ్చును. కల్పాంతమున సప్తసాగరములు ఏకము కావచ్చును. కాని ఆప్తకాములైన మహాత్ములుమాత్రము ఎన్నడును జలింపక నిశ్చలస్థితినుందురు. మరియు రమ్యనిర్మిత మహారాజాంతఃపురములనున్నను, లేక సింహ, శార్దూల, శరభాది హింస్రక మృగయుక్త అరణ్యమున నున్నను 'అరణ్యే సదనే తుల్యే సమాహిత మనోదృశాం' సర్వ

సములగు వారు రెంటి యందును నిర్లిప్తులై యుందురుగదా! అట్టి నిర్లిప్తస్థితియందు ఓలలాడుచున్నదగుచు, సమగ్రసాధనల దేలుచు, నీ కాలమున బంచాగ్నితపమునుగూడ నామె యొన రించి తత్సిద్ధిని బొందెను.

యథార్థముగ నామెకు సాధన లవసరము గాకున్నను 'అశ్రేష్ఠః శ్రేష్ఠానుసారీ' అనునట్లు ఉత్తముల ననుసరించియే సామాన్యులు సాధనజేసి అనుభవమును గడింపవలయును గాన మానవాకృతి ధరించిన మన శారదయు బూజాదికమును నియమిత కాలముల గావించుచు, శ్రీ రామకృష్ణోపదేశముల, అనేక తదితర గ్రంథముల శ్రవణము జేసియు, ప్రాతః సాయంతనము లలో జప ధ్యానముల నొనర్చియు జీవితమును నియమబద్ధ మొనర్చి, శాంతి నార్జించు విధానమును బోధించెను. 'స్వయం తీర్ణః పరాన్ తారయతి' తాను తరించిగదా పరులకు మోక్ష మిడుట. భావికాలమున దనకై శ్రీ రామకృష్ణునిచే నిర్మితమై యున్న పారమార్థిక గురుపీఠము నధిరోహించుటకు సర్వాధి కారముల బడసి, సద్గుణ సుశోభితయై, సువర్ణమునకు మెరుగు బెట్టబడినట్లు తన సహజగుణములకు వన్నె అధికమగురీతి సర్వ సాధనల సంపూర్తిజేసెను. అవును, గురు వగుటకు బూర్వము బహుక్లేశముల ననుభవించుచు, అనేక సాధనల జేయుచు, అనుభవానందముల మగ్నత నొందవలయును గదా! ఎట్టి గురుస్థానము వహించినదో, ఆమె ఉపదేశవిధాన మెద్దియో యింకను ముందు గాంచెదము గాక!

# కలకత్తా ప్రవేశము

ఇట్లు శ్రీ శారదామాయి ఆ గ్రామమున నొక వత్స రము నివసింపగ, శ్రీ రామకృష్ణదేవుని శిష్యులందరును, ముఖ్యముగ స్త్రీశిష్యులగు గోలప్‌మాయి, యోగినీమాయి, గౌరీమాయి మున్నగువారు శ్రీ శారదకు సన్నిహితులై యామె ఆధిక్యతను గ్రహించి యుండిరికాన, గురుదేవుని శిష్యులకు జెప్పి శ్రీ శారదాదేవిని గలగత్తకు నాహ్వానించిరి. శ్రీ శారదయు నా యాహ్వానమును సమగ్రముగ నాలోచించి సమ్మతించెను. ఆ విధముగ నామె కలకత్తకు జేరుటతోడ శిష్యవర్గమంతయు ముఖ్యముగ స్త్రీలు ఆనందించిరి. వారియానందమునకు గారణము లేకపోలేదు. శ్రీ రామకృష్ణు డున్నకాలముల, శ్రీ శారదకూడ నటనున్నను, ఎవరికిగూడ దెలియదు. ఆమె తెల్లవారుజామున మూడుగంటలకే మేల్కొని గంగాస్నానాదుల ముగించి తన గదిలోనికి వెళ్ళెడిది. మరల బయటికి వచ్చెడిదికాదు. అందుచే నామెనుగూర్చి శ్రీ రామకృష్ణుని శిష్యులలో కొద్దిమందికే తెలియునుగాని కలకత్తవాసులకు దెలియదు. మరియు, కొందరు శ్రీరామకృష్ణుని ధర్మపత్నియగుటచే నామెను గౌరవింపవలె ననుకొనిరి కాని ఆమెయే తమకు, దన వాక్సుధామహిమచే ముక్తినొసంగు జ్ఞానప్రదాత్రి యని వారు భావింపలేకైరిగదా! అవును, సామాన్య వనిత వలె మెలగుచు, తన యనుభవసంపదను లోనిముడ్చుకొనుచుండు నామెను గ్రహించుట ఆమె సన్నిహితులకే దుస్సాధ్యమగుచుండ నిక నేనాడును ఆమెను దిలకింపనివారలచే నామె గ్రహింపబడునా!

ఆమెలోఁగల ఏదివ్యశక్తిని గనుగొనెనో కాని శ్రీశారదా నందస్వామి శ్రీ శారదాదేవి నిర్యాణపర్యంత మామెను వీడక ఆమె వసతుల నేర్పరచి సకల శుశ్రూషల నొనరించు చుండెను. శ్రీ శారదామాయికి, ఆమె శిష్యురాండ్రకు వలయు సౌకర్యముల జూచుచు, ఆమె ఆజ్ఞల శిరసావహించుచు, దన వినయ విధేయతలచే నామె ప్రేమను జూరగొనుచు, ఆమె అనుగ్రహ వీక్షణములకు బ్రార్థన సలుపుచు, ఆ మాతృమూర్తి హృదయమున శాశ్వతస్థానమును సంపాదించుకొనెను. శారదా నందుని సంకల్పముల నెరింగిన మన శారదయు నాతని నధిక ముగ బ్రేమించుచు, ఆతని సాధనలగలుగు సంశయ పరంపరను విచ్ఛేద మొనరించుచు, శాంత్యానందముల నిమగ్నుడగుటకు సహాయభూతయై, మాతృదేవతయై, గురుమూర్తియై చెల్వొం దెను. కాన ఆమె తానెట కరిగినను శారదానందుని దన వెంట గొనిపోయెడిది. శ్రీ శారదాదేవి, చివరి దినములలో రోగ గ్రస్థయై యుండుకాలమున శిష్యురాండ్రు ఆమెకు నడిరేయి ఒకొక్కపర్యాయము ఔషధ మీయవలసివచ్చెను. ఔషధ సేవనమున కామె యిచ్ఛగింపనిచో వారు వెంటనే ఆ అర్థరాత్రి సమయముననే శారదానందుని రప్పింతురు. ఆతడును సహజ భక్తిశ్రద్ధలతో మాతృశ్రీచెంత జేరి, మాతృభక్తి ముఖమున దొణికిసలాడ, మెల్లని మృదు మధురస్వరమున 'అమ్మా ! మీ ఆరోగ్య మెట్లున్నది? ఔషధమును సేవించితిరా? లేనిచో కొద్దికాలముండి పిదప స్వీకరింపుడు' అని చల్లగ బలుకును. అంత నామెయు 'నాయనా! అట్లే చేయగలను. వీరు నన్ను బలాత్కరించి మందును ద్రాగింప జూతురుకాని నీవు పలికి

నట్లుగ నెమ్మదిగ వచింపరు. నీకు శ్రమకలిగించిరి. బిడ్డా! యిక నీవు పరుండుము' అని తన హస్తముచే నాతని శిరస్సు నిమురుచు, బుత్రవాత్సల్యముప్పొంగ బుజ్జగించి ఆతని దిరిగి బంపివేయును. ఆ తల్లిబిడ్డల సంబంధమట్టిది. పసిబిడ్డవలె నామె పద సన్నిధిని మనుచు, సంతతము ఆమె దృష్టినుండుచు, ఆమెను దర్శించుచు, ఆమె ఉపదేశవాక్యసారముల మనసార గ్రోలుచు మనిన శారదానంధుని అదృష్టమే అదృష్టము. 'సాధూనాం దర్శనం పుణ్యాం స్పర్శనం పాపనాశనం' అనునట్లు శ్రీ శారదా మాత దర్శన స్పర్శనములచే నశేష ఆధ్యాత్మికానందముల బడసి, దుఃఖభాజనమగు నీ జననమరణ పరంపర నధిగమించి యుండెను శారదానందుడు. అట్టి పవిత్రవ్యక్తి కావున, మన శారద 'నేనెట కరిగినను నా బిడ్డ శరత్తును అనగా శారదానందుని మాత్రము తీసికొనిపోయెద'నని ఆతనిగూర్చి పలికెడిది.

పైవిధముగ నామె ప్రేమ సాగరమున గ్రుంకులిడి, ఆ ప్రేమసుధ నాస్వాదించి, అంతతో దృప్తిగాంచక, ఆ యమూల్య విశేషముల దన సోదర ముముక్షుకోటి కందించు నుద్దేశమున, Mother Worship in India 'భారతదేశ శక్తి పూజ' అను గ్రంథమును లిఖించి 'ఎవరి కరుణా కటాక్షముచే నీ రచయిత సమస్త స్త్రీలయందును జగన్మాతృ స్వరూపమును దర్శించెనో అట్టి శ్రీశారదామాత పాదపద్మములకు నీగ్రంథము భక్తిపూర్వముగా సమర్పితము' అని ఆగ్రంథమును తన యిష్ట దేవతయగు శ్రీ శారదామమణీదేవి చరణ సరోజములకే యంకితమొనర్చి శారదానందస్వామి తన జీవితమును సార్థక మొనరించుకొనెను. తాను ఆమె సాన్నిధ్యమున మెలగుచు

బునీతుడై, తన నామధేయమును, దివ్యమాతయగు శారదా దేవి పుణ్యనామముతో మేళవింప జేయుటకో యనునట్లు అందు మొదటి అక్షరత్రయమును తాను జేర్చుకొని పవిత్రీభూతము గావించి, అంతట తన రచనముకూడ పవిత్రవంతమై యొప్పార వలయునను దృఢ సంకల్పముతో దానినిగూడ ఆమెకే అర్పించి, మూడువిధముల నామెతో సన్నిహితత్వమును బడ సెను. అది ఆ మహానుభావుని దివ్యసంకల్పశక్తియై యుండ నోపు!

అట్లు అమెయందు విశేష భక్తిప్రపత్తులు కల శ్రీ శారదానంద, యోగానంద, గోలప్‌మాయి మున్నగు శిష్యబృందము ఆమెకై శాశ్వతముగ నొక మఠమును బాగ్ బజారులో నిర్మించిరి. దానికి 'ఉద్బోధన్' అని నామకరణము జేసి శ్రీ శారదా దేవి ఎల్లప్పు డట నుండ నేర్పాటుజేసిరి. అప్పటికే శ్రీ శారదా దేవి బలరామబోసు, నీలాంబరముఖర్జీ మొదలగువారి గృహముల గొంతకాల ముండి, తీవ్రతపము గావించి, తనకొరకే తెంచు భక్తులకు బీయూషతుల్యములగు మృదుమధురవాక్కులచే,నాధ్యాత్మికవిషయముల బోధించుచు, దరచు సమాధిస్థితుల ననుభవించుచు, నొక సమయమున నిర్వికల్పమునుగూడ అనుభవించియు నుండుటచే నామె కీర్తి జగద్విఖ్యాతమై వెలుగొందెను. దాన నామె దర్శనాపే క్షతో ఆమె యమృతవాక్కుల నాలకించుటకై, వేలకొలది భక్తు లరుదెంపసాగిరి. సుగంధసంయుక్తమగు కుసుమము వికసించుతోడనే యందలి మకరందమును గ్రోల బిలువకయే మధుపము లరుదెంచుచందము, ఆధ్యాత్మికానుభవానందా

మృత సంపేతమగు శ్రీ శారదాపద్మము వికసించినతోడ, నాయాధ్యాత్మిక మకరందపరిమళము పిల్లవాయువులచే సర్వత్ర ప్రసరించి, యా పారమార్థిక సుధాస్వాదనమునకై యనేక భక్తగణములు ఆమె నాశ్రయింప నారంభించిరి. పుష్పము తన సువాసనను, కొందరినే యాఘ్రాణింపు మనుటయు, గొందరిని వలదనుటయు నెట్లుండదో యట్లే మన శారదాదేవి సన్నిధానము జాతి వర్ణ మత లింగ భేదములేక సర్వసమత్వమును బ్రకటించుచుండెను.

ఇట్లు పారమార్థిక వియద్విహారమున నానందడోలికల నూగుచున్నను, బూర్వోక్తముగ సర్వసమత్వమును తన శిష్యకోటియగు ఆధ్యాత్మిక బంధువులందును, శారీరక సంబంధులగు బంధుకోటియందును మన శారదామాయి జూపుచునుండెను. బంధువర్గ మామె నాశ్రయించియున్నను, వారిమధ్యనే తన జీవితమును గడుపుచున్నను, ఎట్టి యహంకార మమకార పాశముల దగుల్కొనక 'పద్మపత్ర మివాంభసా' అనురీతి నళినీదళ జలకణమువలె స్వచ్ఛమై యామె ఎవ్విధమున బ్రవర్తించెనో గ్రహించెదముగాక! సంసారమున బంధుమిత్రులతో నివసించుచు భగవద్దర్శనము బొంద సాధ్యమా యని ప్రతివ్యక్తికి కలుగు శంకయే యిది. గృహమున నివసించియు, నీపణముల బారద్రోలి నిర్మలహృదయులై, కుమ్మర పురువు మట్టిలోనున్నను ఎట్లు దానికి నుంతయైన నడుసు యంటదో, యట్లే సంసారముననున్నచో ముక్తి కరతలామలకమగును. 'అయం నిజః పరోవేతి గణనా లఘు చేతసాం' ఇత్యుక్త్యా, ఇతడు పర అను భేదము సంకుచిత మనస్కులకు

గలుగును. స్వార్థపరులకు సంకుచితాది యవలక్షణములు కాని విశాలహృదయుల హృదయమున విశ్వప్రేమయే న ర్తనము సలుపును. జగన్మాతయగు భవతరణిని బూజించి, వినిర్మల విశ్వవ్యాపకమగు ప్రేమజలధిలో మునిగిన శ్రీ రామకృష్ణదేవునికి సర్వార్పణము గావించి, ఆపవిత్రప్రేమ వీచికల తన్మయత్వము నొందిన సహజ ప్రేమరూపిణియగు మన శారదయందు విశ్వ మానవ ప్రేమగాక సంకుచితత్వము వెలయునా ? అట్టి ప్రేమయే గదా మూర్ఖులకు సహితము పరివ ర్తనము కలిగించు నది! అట్టి ప్రేమయేగదా భగవత్సాన్నిధ్యమును జేర్చునది ! అట్టి ప్రేమచేతనే గదా శిష్యసమూహ మేతెంచుట ! అట్టి ప్రేమచేతనేగదా సంఘములభివృద్ధి చెందుట ! ఆమె బాంధవ సమాజమున మెలగి, గృహస్థుల కెట్లు ఆదర్శప్రాయమైనదో గ్రహించెదముగాక.

శ్రీ శారదాదేవి కలక త్తలో నుండుచున్నను, అప్పు డప్పుడు తన ముదుసలితల్లియగు శ్యామసుందరిని, దన దమ్ము లగు ప్రసన్నకుమార, వరదాప్రసాద, కాళీకుమార, అభయ చరణులను జూచుటకును, సోదరులు పసివారగుటచే వారికి దోడ్పడుటకును జయరామవటియందు గొన్నిమాసము లుండె డిది. అప్పుడు మన శారదామాయియే ధాన్యమును దంపుచు, వంటనుసేయుచు, సర్వవ్యవహారముల జక్కబెట్టుచుండెడిది. అంతియగాక తన జ్యేష్ఠసోదరుని తల్లిలేని యిరువురు బాలిక లకుగూడ నామెయే తల్లివలె రక్షించెడిది. మరియు తన నాల్గవసోదరుడగు అభయచరణుడు ఆమెకు ఎక్కువ ప్రేమ పాత్రుడు. ఈతడు విషూచివ్యాధి కాహుతియై 1899 వ

సంవత్సరమున మరణశయ్యనుండి, సోదరియగు శ్రీ శారదను వీక్షించి తన భార్యయగు సురబాలను, ఆమెకు గలుగబోవు శిశువును ఆమెకు ఒప్పగించుచు 'నీవే వారికి సర్వమును' అని శరీరమును బాసెను. అప్పటికి దుర్బలయగు సురబాలకు నీ కష్టముతో మనోచాంచల్యము గలిగెను. అట్టి యున్మాద స్థితిలో నామె యొక్క యాడశిశువును గనుటచే, నా యిరు వురి పోషణభారము మన శారదమీద బడెను. శిశువగు రాధారాణియు, శారదామాయియే తనవిషయముల నెక్కు డుగ విచారించుటచే నామెనే తల్లిగ భావించి, కాలక్రమ మున 'నమ్మా' యని పిలుచుచు, నామెను విడనాడకుండెడిది. కొంతకాలము ఆ గ్రామమున శారదాదేవియుండి కలకత్తకు నేతెంప నా బిడ్డయు నామె యెడబాటును సహింపకుండుట చేతను, ఆ బిడ్డకు తగు సదుపాయముల పిచ్చితల్లి సేయజాల కుండుటచేతను, వారిరువురి బాధ్యత శ్రీ శారదపై నుండుట చేతను వారినిగూడ మన శారదామాయి కలకత్తకు రప్పించి వారికి వసతుల జూడజొచ్చెను. కాలక్రమమున తల్లి పిచ్చి బిడ్డయగు రాధారాణికిగూడ పట్టువడుటచే వీరిరువురిమూల మున నామె యనేక కష్టనిష్ఠురములకు లోనయ్యెను. కాని వాని నన్నింటి నామె సహనమూర్తియై సహించెను.

అవును, మంచి వారిని, స్వార్థమున కుపయోగపడు వారిని ప్రేమించుట సహజమే. కాని దుర్మార్గులను, స్వార్థులను తమకే యిడుముల దెచ్చువారిపై దయదలచి నిస్స్వార్థ నిష్క ళంక ప్రేమతో వారి శ్రేయమునే కాంక్షించి చెడును జూడక, ప్రేమించుట లోకమున దుర్లభముగదా! అట్టి పవిత్రప్రేమ

పారమార్థికానుభవ సంపదల దులదూగు మహాత్ములసొమ్ము గాని వ్యావహారికముగ సంసారమున స్వార్థులైయున్న వారలకు దుర్లభము. అదియే పారమార్థికముయొక్క వైభవము. అదియే యాధ్యాత్మికానుభవ సంపన్మహిమ. అదియే నిత్యానంద శోభా ప్రభావము. అదియే శాంతిసంధాయకస్థితి. 'యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ' వాగాది బాహ్యేంద్రియము లాబ్రహ్మమును గ్రహింపజాలక మనస్సుతో గూడ మరలినట్లు, యిట్టిస్థితుల మగ్నతనొందిన వారిని గ్రహించుకొనుట మిగుల కష్టము. ఇక వారి వర్ణింప నేరికగును! అట్టి సమయములందే వారి యాధ్యాత్మిక సంస్థితులు సుమంత బహిర్గతము లగు చుండును. అట్టి సమయములందే వారి స్థిరత్వము తెలియబడు చుండును. అట్టి స్థితులందే వారి యనుభవరత్నములు వాక్కుల ద్వారా ప్రవహించును. వారు బాహ్యమునకు బంధుసమూహములనుండి వారిని ప్రేమించినట్లును, సంసారపాశబద్ధులై యున్నట్లును గోచరించినను, 'యస్మిన్ సర్వాణి భూతాన్యాత్మైవాభూద్విజానతః। తత్ర కో మోహః కశ్శోకః ఏకత్వ మనుపశ్యతః॥' అనునట్లు సకల భూతకోటియందు సర్వసమత్వమును జూపుచు ఏకత్వమును గల్గిన వారి హృదయమున శోక మోహములకు దావెక్కడ? రాగద్వేషములకు నెలవెచ్చట? అహంకార మమకారపాశముల దగుల్కొనుటెడ? సర్వద్వంద్వాతీతులుగదా మహాత్ములు!

శ్రీ శారదామాయి యిట్లు వ్యావహారికముగ బంధువులమధ్య మెలగుచున్నను, 'యావద్విజ్ఞాన సామీప్యం తావ

వైచ్ఛిష్ట్యం వివర్ధతే' విజ్ఞానము సమీపించుకొలది శ్రేష్ఠత్వము వర్ధిల్లుచునే ఉండును అనునట్లు ఆమె యాధాత్మికస్థితి కావంతయు లోపములేకుండుటయే గాక నది అధికతర కాంతివంతముగ ప్రకాశించెను. ప్రతిదినము ఆమె జపధ్యానముల నియమము ననుసరించి చేయుచు, నుత్కృష్ట సమాధులగూడ బొందుచుండెడిది. యథార్థముగ యోచించుచో, ప్రథమమున నియమనిష్ఠలతో జపాదుల నొనర్చుచు, సమాధిసాగర విలీనమగుచు, పిదప నియమాతీత స్థితులకు బోవుట యగును గదా! అందుచే నియమమునుండి నియమాతీతస్థితిని బొందుమని మన శారదామాయి మనకు బోధించుచున్నది. అంతియగాక, అభ్యాసముచేతనే సర్వము లభ్యముగదా ! 'అభ్యాసేన లభ్యః' అనిగదా పతంజలి ప్రోక్త యోగశాస్త్ర తాత్పర్యము! 'అనభ్యాసే విషం విద్యా' అభ్యాసములేనిచో విద్య విషమగు ననునట్లు సాధనలేని సర్వము విషతుల్యముగదా !

## గురుస్థానము

ఇట్లు ఆమె సర్వసల్లక్షణముల గ్రహించియే శ్రీ రామకృష్ణ పరమహంసదేవుడు శ్రీ శారదనుగూర్చి 'నిజవర్ణమును బూడిదచే గప్పికొనజూచు పిల్లి' యని ఛలోక్తిగ బల్కెడివాడు. ఈ విషయమున ప్రేమానందస్వామి 'ఆమె సర్వశక్తి నిలయ. శ్రీ రామకృష్ణుడు ప్రయత్నించియు దన యనుభూతుల దాచుకొనలేకుండెను. కాని ఆమె యట్లుగాక దన అనుభూతుల దిగమ్రింగెడిది' అని శారదనుగూర్చి వచించెను.

అట్లు సమాధి గగనముల విహరించుచున్నను నామెయం దెట్టి గర్వమును పొడసూపెడిదికాదు. అందుచేత సామాన్యవనితవలె జీవించు మన శారద ఎల్లప్పుడును దన యనుభూతుల బయట బడనీయకుండెడిది. కాని ఒక్కొక్క సమయమున నామె నోట నప్రయత్నముగ దన దేవత్వమును బ్రకటించు వాక్యములు వెలువడుచుండెడివి. ఒకనాడు దన సంసారసంబంధముల బ్రస్తావించుచు 'సంసారకృత్యముల మునిఁగి దేలుచున్నను, ఎపుడా దివ్యానందస్థితిని గాంక్షింతునో వెంటనే యీసర్వము మిథ్యయని గ్రహించి, ఆనందమున మగ్నత నొందగలను' అని ఆ బ్రహ్మానందానుభూతి తన హస్తగతముగా ఆమె యిటుల వచించెను. మరియు వేరొకసారి ఎల్లప్పుడు ఆరోగ్యైశ్వర్యముల గోరు వారినిగూర్చి 'పొరపాటుననైన భక్తిజ్ఞానముల నన్నర్థించిన, భగవత్సాక్షాత్కారము కరతలామలకమగు నేను వాని నివ్వకుందునా?' అని యామె బలికెను. అంతియగాక, 'నన్ను మీరు బంధువుగ భావింపవలదు. నా యిచ్ఛవచ్చినపుడీశరీరత్యాగము నొనరింపగలను' అనియు, తనను బంధుదృష్టి జూచువారికి తెలిపెడిది. 'నేను జీవించి యున్నంతకాలమును, నా యాథార్థ్యతను ఎవ్వరును గ్రహింపజాలరు. కాని నేను సర్వప్రపంచమున బ్రతిగృహమున నర్చింపబడుదును' అని తన సమాజస్వరూపమును నెరుంగనివారితో నామె వక్కాణించెను. ఎట్టి పాపములనైన జేయ వెనుదీయని వారినిసైతము వారి దుర్నడతల సరకుగొనక, ఆమె దయతో 'నాయనా, ఇక్కడకు వచ్చువా రెట్టివారైనను నన్ను 'అమ్మా' యని పిలుచుటతోడనే వారిపాపములు పటాపంచలై వారు ఆశించు

దానికంటె నధికముగ భక్తిజ్ఞానముల బొందగలరు' అని యొక శిష్యునితో బలికెను. మరియు 'లోకమునకు భగవన్మాతృత్వమును నిరూపించుటకై శ్రీ రామకృష్ణదేవుడు యీ ప్రపంచమున నన్నుంచెను' అనియు, 'నా కృపాపాత్రుడు కానివా డదృష్ట విహీను' డనియు, దన యాధ్యాత్మికస్థితి ఆధిక్యతను గ్రహించి బల్కిన శ్రీ శారదవాక్యములు అమోఘములు. 'మిమ్ము దిలకించిన నింక నే దేవతల బూజింప బుద్ధి వొడమకున్నది' యని యొక సాధుసత్తము డామెతో బలుక, నామెయు, 'నెందుచేత ? పూజింపవచ్చును. ఆ సమస్తదేవతలు నా యంశములే కదా!' యని తన సర్వదేవతామూర్తిమత్వమును వ్యక్తపరచె నా సమాధానమున! ఇంకను అనేక పర్యాయములు ఆమె తన యున్నత మానసికస్థితినుండుచు 'తానే జగన్మాత' యనియు 'శ్రీరామకృష్ణునకు దనకు నభేదమే' యనియు, 'ఎట్టి వారికైనను మోక్షము నొసంగగల' ననియు బలుకుచు, మరల సాధారణస్థితికి వచ్చునప్పుడు వానిని గప్పిపుచ్చుటకు యత్నించుటయు గొలది శిష్యులు గమనించిరి. అనగా నామె ఏమియు దెలియనిదానిరీతి వ్యవహరించెడిది. పై విధమున, సర్వానుభవముల కాకరమైనట్టి, యామె యున్నత మానసికస్థితులు ఆధ్యాత్మిక మేరుపర్వతము నధిష్ఠించినట్లు ఆమెయొక్క త్యాగముగూడ నట్టిస్థితినే యధిగమించి యుండెను. ఆమె త్యాగవైభవము సూచించు నొక దృష్టాంతము నిట దెల్పెదను.

1909వ సంవత్సరమున రామనాథపురరాజు శ్రీ శారదాదేవిని తన గృహమున కాహ్వానించి తన భవనమునగల విశ్వ

ర్యముల నామెకు జూపింప నొక యున్నతోద్యోగిని వెంట నంపి శ్రీ శారదాదేవి ఏవస్తువునైన బ్రేమతో జూచిన నద్దాని నామె కొసంగవలయునని యాజ్ఞాపించెను. అటగల వజ్ర వైడూర్యాది సకలాభరణములనెల్ల జూచియు, మన శారద వానిని గోరలేదు. అవును, శాశ్వతాధ్యాత్మిక ధనరాసులనే వశపరచుకొనిన ఆజగజ్జనని మానసము యీ యశాశ్వత వస్తువాహనాదుల గోరునా! ఇదియే ఆ మహాతల్లి యుత్కృష్టాధ్యాత్మికాధిక్యత! 'తేన త్యక్తేన భుంజీథా' త్యజించి యానందింపుమనిగదా యుపనిషద్వాక్యబోధ! అట్టి త్యాగమే శారదాదేవికి శిరోభూషణమై ఆమె ప్రతిభ జగద్వ్యాప్త మొనరించెను. పూర్వ మొక పర్యాయము దక్షిణేశ్వర దినములలో, ధనికుడగు లక్ష్మీనారాయణుడను మార్వాడీ శ్రీరామకృష్ణునికడ కరుదెంచి వారిపైగల భక్తిచే బదివేలరూపాయల శ్రీరామకృష్ణునిపేర నుంచుటకై యనుజ్ఞను గోరెను. కామకాంచన త్యాగమూర్తియగు శ్రీరామకృష్ణుడు దాని నిరాకరించెను. కాని యా మార్వాడీ, ఎంతకు వదలక బోవుటచే, శ్రీరామకృష్ణదేవుడు శారదామాయిని బరీక్షించుటకోయన నాతని శారదకడకు బంపెను. అంత నతడు శారదనెట్లైనను బ్రతిమలాడి, ప్రార్థించి సమ్మతింపజేయవచ్చునని భావించి, ఆమె వద్దకేగి విషయము దెలిపెను. శ్రీశారదయు దాని దృణముగ ద్రోసిపుచ్చి యతనిని బంపివైచెను. చూచితిరా! ఆమెకు త్యాగమే సంపదగా శోభిల్లుచుండ నిట్టి ఐహిక ధనమునకై ఆమె ప్రాకులాడునా ?

త్యాగశీలురకే ఉపదేశార్హతయు గురుస్థానము నలంకరించు శక్తిసామర్థ్యములును, శిష్యుల శ్రేయోభివృద్ధిని గాంక్షించుటయును, వారి యఘపుంజముల దొలగద్రోసి ముక్తి నొసంగు స్థితియు గల్గును. శ్రీశారదాదేవి తన నాశ్రయించి యున్న ముముక్షు జనసంఘమునకు వారి వారి గుణముల ననుసరించి యుపదేశముల నొసంగుచు, జాగ్రత్తగా వారి యభివృద్ధిని బరిశీలించుచు నుండెడిది. గురుస్థానమును వహించుట యన భారమును మోయుట యనియే గదా యర్థము. గురువన ప్రాపంచిక విషయ పాశములనుండి శిష్యుని అమృతత్వమగు మోక్షసామ్రాజ్యమును బొందించెడువాడుగాన, శిష్యుడట్టి గురువుద్వారా, జనన మరణరహిత కైవల్యమును బొందగల్గిన నాడే వాని జన్మ సార్థకము. అట్లు ముక్తినొసంగ లేనివాడు గురువనంబడడు. అందుచేతనే 'గు' శబ్దస్త్వంధ కారస్య 'రు' శబ్ద స్తన్నిరోధకః। అంధకార నిరోధిత్వాత్ 'గురు' రిత్యభిధీయతే॥' 'గు' యను శబ్దము అంధకారమునకును, 'రు' శబ్దము తన్నిరోధమును సూచించునుగాన గురువు అను వ్యవహారము కలిగినదని అద్వయతారకోపనిష ద్వాక్యము. నిజమే. అంధకారమగు అజ్ఞానమును బోద్రోలి జ్ఞానమను వెలుగును బ్రసాదించువాడేగదా గురువు? అజ్ఞానకల్పిత పాపముల బరిహరింపజేయు శక్తిగలవాడేగదా గురు శబ్దమున కర్హుడు! అట్టి యీ గురు శబ్దము మన శారద కెట్లు సార్థకమయ్యెనో కనుగొందము.

గురుశిష్య సంబంధము పరమ పవిత్రము. అట్టి పవిత్ర సంబంధము, వారు లౌకిక విషయవాసనల ద్యజించిననాడే

కలుగును. అప్పుడే గురుశిష్యుల కత్యంత సన్నిహితత్వ మేర్పడి శిష్యుడు త్వరితగతి నాధ్యాత్మిక స్థితుల బొందగలడు. శక్తి సంపన్నుడైన గురువు ఉపదేశ సమయమున శిష్యుని పాపముల రూపుమాపి, తన శక్తిని మంత్రముద్వారా శిష్యునియందు బ్రవర్తింపజేసి, శిష్యుని సర్వబాధ్యతల దానే వహించును. ఇట్లు గురులోకము కృపాహృదయులై కొందరికి నుపదేశముల నొసంగి వారి పాపముల ననుభవించుటచే జీవిత మును త్వరగ త్యజింతురు. ఆహా, ఎట్టి ప్రేమ వాత్సల్యములు వారి హృదయమున నెలకొని యున్నవో గాంచుడు! శిష్య శ్రేయస్సుకై యెట్టి స్వార్థ రాహిత్యము వారియం దిమిడి యున్నదో గ్రహింపుడు! అట్టి విర్మల హృదయులు ప్రపంచ క్షేమమునకై తృణప్రాయముగ నసువుల నెట్లు యెంచెదరో ఎరుంగుడు. పవిత్ర ప్రేమవాత్సల్యములన నట్టివేగదా! అట్టి వారు దైవసమానులే! కాదు, 'బ్రహ్మవిత్ బ్రహ్మైవ భవతి' యని యుపనిషత్తు లుద్ఘోషించుచుండ వారిని దైవతుల్యులనుట గాక బ్రహ్మమే యనవలెను.

పూర్వము శ్రీ రామకృష్ణదేవుడు సజీవముగనున్నపుడు తన అనంతర మాధ్యాత్మిక గురుపీఠమున నాసీనయై, అసం ఖ్యాక జనుల కాశ్రయమిడి, శాంతి ప్రదాత కాగలదని శారదను గూర్చి తలంచి, ఆమె అభిప్రాయ మరయుటకో యనునట్లు ఆమెను బిలిచి 'శారదా! చూడమ్మా. పరిసర ప్రజానీకము అంధకారమున వసించు కీటకసమానులు. నీవు వారిని రక్షింప వలయును సుమా' అనియు, మరియు దన కంఠమున వ్రణముచే బాధనొందుచు నంత్యదశయందుగూడ శారదను రప్పించి అవ్యా

జానురాగములతో 'ఏమమ్మా! నీ వేమియు జేయవా? సర్వ మును నేనే గావింపవలయునా? నీ వొనరించునది అధికముగ నున్నది సుమా!' అని ప్రపంచరక్షణార్థ మామెను మరల హెచ్చరించెను. అనగా 'గురుపదవిని స్వీకరింపు' మని వాకొనెను. కాని గురుపదవీ స్వీకరణముజేయుట సామాన్యము కాదు కాన మన శారద అందులకు అంగీకరింపదయ్యెను. 'గురు' అను నామమును వహించి, శిష్యుల సభివృద్ధికి దీసికొని వచ్చు నుపాయములు లోపించినను శిష్యతృష్ణ అధికమై, వారిని జేర్చుటయే గురు శబ్దమున కర్థముకాదు. శిష్యుల, పారమార్థిక గమ్యమును జేర్పగల శక్తిసామర్థ్యములు గలవాడే గురువు కదా! పిమ్మట శ్రీ రామకృష్ణ నిర్యాణానంతర మామె తీర్థ యాత్రల జేయుటయు, ఆమెతో యోగానంద, అభేదానంద, అద్భుతానందాదు లేగుటయు మన మిదివరలో జూచితిమి కదా! ఆ యాత్రలలో బృందావనమున మన శారద తీవ్రతపో తత్పరత నుండ, మరల శ్రీ గురుదేవు డామెకు సాక్షాత్కరించి యోగానందున కుపదేశముజేయ నాజ్ఞనొసంగ, నామెయు మారుబలుకక, గురుదేవు నానతిని దల ధరియించి, ప్రథమమున గురుస్థానము నలంకరించి అతనికి ఉపదేశ మొసంగినది. మరల దృతీయపర్యాయము శ్రీ రామకృష్ణు నాదేశమును స్వీకరింప వలసిన కాల మరుదెంచువరకు వేచియున్నదో, లేక తనకు సంపూర్ణ సగుణ నిర్గుణానుభవములు సిద్ధించుదనుక నాగి యున్నదో, లేక ముముక్షుకోటి యార్తితీవ్రతరమగువరకు నిలచి యున్నదో మనము గ్రహింపజాలము.

శ్రీ శారదామాయిగూడ ప్రపంచోద్ధరణ కార్యమును నిర్వహింప వలసిన బాధ్యత గ్రహించి యుండుటచే నామె మృదుల హృదయము ద్రవించి తనను ఆర్తితో నర్థించి ఆశ్రయించిన వారి కెల్లరకు వారి సర్వబాధ్యతల వహించి, ఉపదేశము నొసంగి, సాధనల జేయించి ముక్తినొసంగెడిది. ఆమె ఉపదేశమియ్యక నెవరిని బంపివేయలేదు. ఇట్లుపదేశముల నొసంగుటయు సాధనల జేయించుటయుమాత్రమేగాక, శిష్యులొకవేళ సక్రమరీతి సాధనల సేయజాలనిచో వారికొరకై ఆమెయే జపధ్యానముల గావించెడిది. శిష్యుల అభివృద్ధికై యాతాపత్రయ మేలకో! కొందరు ఆమెకు ప్రణామమాచరించినచో వారిపాపముల వలన నామె మిగులబాధ నొందెడిది. అయినను అట్టి వారినిగూడ నామె వలదనదుగదా! అంతియ గాక 'నాయనా! నేము లోకమున జన్మించినది మీబోంట్లను ప్రపంచమునుండి తరింపజేయుటకేగదా. అట్టిచో మేము మిమ్ముల దిరస్కరించుట భావ్యమా! మీ యఘసంచయమును నశింపజేసి, మిమ్ముల మేము గాపాడనిచో నింక మిమ్ముల దరింపజేయువారెవ్వరు?' అని దయార్ద్రహృదయమై యొక పర్యాయము ఆమె ఒక శిష్యునితో నపార ప్రేమదీప్తి మోమున జిందులాడ బలికెను. అందుచేత యామె వారల నుపదేశములొసంగి వారి బుద్ధిని సాధనమీదనే కేంద్రీకరింపజేయ, 'సాధనజేయునపు డనేక సిద్ధులు కలుగును. కాని యట్టి మహత్తులకై యారాటబడరాదు. వానివలన ప్రయోజన మావంతయు కలుగకపోగా భగవదనుభూతి కాటంకము లేర్పడును. కాన భక్తిజ్ఞాన విరాగముల నభివృద్ధి గావించు

కొనుటకు యత్నింపుడు' అని మరల మరల ఆ శిష్యులకు హెచ్చరిక జేయుచుండెడిది. మరియు నామె శిష్యుల శ్రేయస్సును గాక్షించి శ్రీ రామకృష్ణుని సంబోధించి 'దేవా, నా శిష్యులకు జ్ఞానము అనుగ్రహింపుడు. వారు మరల నీదుఃఖ రూపమగు జనన మరణ పరంపరయందు బడక శాశ్వతమగు మోక్షమును బొందుదురుగాక !' యని తన బిడ్డలకై యహర్నిశముల బ్రార్థించెడిది. అట్టి నిష్కామ్యత గలవారేమియు బోధింపకున్నను యథార్థమైన యార్తిగలవాడు వెంటనే మార్పు జెందుననుటలో నాశ్చర్య మావంతయు లేదు. మరియు వ్యక్తినిబట్టి, వారి మనోభావముల గ్రహించి, గృహస్థులకు 'మీరు గృహములోనుండియే సర్వమును సాధింపవచ్చును. సర్వసంగపరిత్యాగ మొనరింప నవసరము లేదు. నేను గృహస్థాశ్రమముననుండియే సర్వమును సాధింపలేదా?' యనుచు మనో పారిశుద్ధతకు బ్రాధాన్యత నొసంగి 'తలలు బోడులైన దలపులు బోడులా?' యనునట్లు 'సన్న్యాసము స్వీకరించి భ్రష్టత నొందుటకంటె గృహమునందే యుండుట మేలుగదా' యనియు గృహమును వీడలేనివారికి తన యాదర్శమును జూపుచుండెడిది.

కాని ప్రపంచవిషయముల హేయములుగ దలంచి, పవిత్ర జీవితమును గడుపదలచినట్టి వారిని వీక్షించి, వారి మనో దృఢత్వమునకు సంతసించి, 'అవును, సంసారములో నేమున్నది? సంసారమనిన నెంత వ్యామోహితులై యుందురీప్రజలు! అందు బడినవారు మరల బయటబడుట యరుదు. మానవుని శక్తి సామర్థ్యము లీవిధముగా దుర్వినియోగ మగుచున్నవి. మీరు

అట్టి ప్రపంచవ్యామోహముల ద్యజించుచున్నందులకు ఆనం దము' అని వారికిదగు సలహాల నొసంగెడిది. బ్రహ్మచర్యము నుండి సన్న్యసించు నుత్సాహముగలవారల బ్రోత్సహించుచు బ్రహ్మచర్య వ్రతానుష్ఠాన ఫలితములబోధించును. అవును, బ్రహ్మచర్యము వినా పారమార్థికానుభవము సాధ్యముగాదు. కాన 'బ్రహ్మచర్య ప్రతిష్ఠాయాం వీర్యలాభః' బ్రహ్మచర్య ప్రతిష్ఠితునికి శక్తిలాభమని యోగసూత్రములు ఎలుగెత్తి చాటు చున్నవి. సక్రమ బ్రహ్మచర్య నియమ పరిపాలనమున ఆధ్యా త్మికగమ్యము నూటికి తొంబదివంతులు సిద్ధించుననియు, మిగిలిన పది భాగములు సాధనచే సుసాధ్యమగుననియు నామె ఉద్బోధ. అందుచేత 'ఊర్ధ్వరేతా భవేద్యస్తు స దేవో న తు మానుషః' ఊర్ధ్వరేతస్కుడు దేవుడేకాని మానవుడు కాజాల డని శాస్త్రము పలువిధములుగ నీ బ్రహ్మచర్యమునుగూర్చి వాక్రుచ్చుచున్నది. అట్టి యర్హతలుగల వారి కామె బ్రహ్మ చర్యదీక్షను, సన్న్యాసదీక్షను నొసంగి యా యా ధర్మముల వారికి బోధించెడిది. భక్తి జ్ఞాన వివేక విరాగములలో నామె వారి కాదర్శముగ నుండెడిది. సన్న్యాసులనిన ఆమె చాల గౌరవమును గనపరచుటయేగాక వారి కితరులచే బ్రణామముల నొనరింప యాదేశించును. ఇట్టి భారమైన గురుబాధ్యతను స్వీకరించి యామె గృహస్థులకు, సన్న్యాసులకుగూడ నాదర్శమై గురుపీఠము నలంకరించి చెలువొందెను. ఇదియే గదా సర్వప్రేమతత్త్వము! ఆమె ప్రేమవాహినిలో లీనమై ఆనందము ననుభవించి యెట్టివాడైనను తప్పక ఆధ్యాత్మిక మార్గమున నభివృద్ధి గాంచవలసినదే. ఆమెయొక్క యపార

ప్రేమప్రవాహము ఎట్టి యడ్డంకులులేని మహాసాగరమై యొప్పారెను.

ఆ ప్రేమ ఒక్కొక్క సమయమున పూర్ణిమనాటిసముద్ర చందమున నుప్పొంగెడిది. అదెట్లన శారదాదేవి ప్రథమమున దక్షిణేశ్వరమున కేగుదెంచినపుడు భావికాలమున సర్వప్రపంచాదర్శమగు భారతీయ ఆధ్యాత్మిక సంస్కృతీ పర్యవసానమగు వేదాంతామృతమును దశదిశల వెదజల్లు శ్రీరామకృష్ణదేవుని బాలశిష్యులెల్లరు తరచు శ్రీ గురుదేవునియొద్ద నుండువారు. గురుదేవుడును వారిచే క్రమబద్ధముగ సాధనల జేయించుచు, వారికి రాత్రి 'యుక్తాహారః' అను గీతావాక్యమురీతి యుక్తాహార మితాహారముల నిర్ణయించెను. కాని భోజనసమయమున నా బాలురు శ్రీ శారదాదేవి ప్రేమవాత్సల్యములకు గట్టువడి గురుదేవుని నీమము ననుసరింపలేరైరి. దీని గమనించిన శ్రీరామకృష్ణుడు ఒకదినము శారదనుజేరి 'ఆహారమధికమైన తమోగుణము అభివృద్ధిచెందును. తమోగుణాధిక్యతచే నిద్ర యధికమగును. అందుచే వారి ఆధ్యాత్మికాభివృద్ధికి ఆటంకము కలుగును కదా!' యని మెల్లన హెచ్చరింప నామెయు 'ఏమి? నే నిడు భోజనము వారికి పారమార్థికముగ నాటంకమగునా? నేను వారి ఆధ్యాత్మికాభివృద్ధినిగూడ వీక్షించుచుంటినిగదా' అని ప్రేమమున సమాధానమొసంగెను. చూచితిరా! అమ్మ ప్రాపంచిక ఆధ్యాత్మిక విషయముల కెంతటిని చూడగలదట! ఏమి ఆమె తీయని సమాధానము! ఏమి ఆ యభయహస్తము!

ఆమె ప్రేమల జూరగొని యా ప్రేమజలధిలో నానంద మును బొందినవారే ధన్యజీవులుగదా! ప్రేమ యన స్వార్థ దూరమై యుండునది. అట్టి నిర్మల, నిష్కల్మష, నిరవధిక, నిశ్చలప్రేమకు దాసులు కానివారెవ్వరు? అట్టి యలౌకిక ప్రేమస్వరూపిణియగుటచేతనే ఆమె కట్టి యపూర్వ గురుస్థానము సంప్రాప్తమై సక్రమరీతి నిర్వహింప బడెను.

'వచ్చినవారలు చూచిపోరుసుమా, అచ్చటనే కూర్చుండియుందురు' అను చందమున శ్రీశారదాదేవి నాశ్ర యించినవారును, ఆమె నొకసారి గాంచినవారును, మరల నామెనుండి సెలవుగైకొను తరుణమున గన్నతల్లిని వీడు బిడ్డల మాడ్కి విలపింతురు. మరియు దల్లిలేనివారు 'శారదయే మాయమ్మ' యని యామెనే ప్రేమించెదరు. తనకొరకు కరు దెంచువారి నామె మిగుల ప్రేమతో నాదరించెడిది. వారు వెడలునప్పుడు వీధివరకు వారి ననుగమించుచు, సాశ్రునయ నయై దృష్టికి వారగుపడునంతవరకు నిలచి చూచుచుండెడిది. వారికేదైన వ్యాధి కలుగుచో మిగుల యాతురత జెందెడిది. ఇట్టి ప్రేమస్వరూపిణి కావుననే ఎట్టి దుర్జనులను జను వారైనను ఆమెకు దాసులై రాజిల్లెడివారు.

ఒకపర్యాయము జయరామవటినుండి శ్రీ శారదాదేవి దక్షిణేశ్వరమునకు వచ్చుచుండెను. ఆమె తన బంధువులతో గలసి తారకేశ్వరమును జేరుటకై పయనము గావించుచుండ, మార్గమధ్యమున మానవులుజొరరాని యరణ్యమార్గము పది మైళ్ళుండుటచే, అప్పటికే సాయంకాలమగుటచేతను, నాప్రాంత

ముల దొంగలు విరివిగ దిరుగుటచేతను, త్వరితముగ నాయరణ్యమును దాటుటకు అందరును వడిగ నడక సాగించిరి. కాని శ్రీ శారదా దేవిమాత్రము నడువజాలక వెనుకబడినదై ముందుబోవువారిని బొమ్మనుచు, దాను వారి దారకేశ్వరమున గలియుదుననియు దెలిపెను. కాన వారు ముందరుగ మన శారదామాయి యొక్కతెయే వెనుకబడినది. పొద్దు గ్రుంకి గాఢాంధకారము ప్రబలెను. అందు ఆమె మార్గమును దడుముకొనుచు, బ్రయాణము సాగించుచుండ, ఆజానుబాహుడగు నొకవ్యక్తి భుజమున నొక దండమును ధరించి వెనుక వచ్చుచుండెను. తనకు ముందు ఎవరో యుండుట గాంచి, యాతడు భీకరస్వరమున 'ఎవరు వా'రని బిగ్గరగ నయ్యరణ్యప్రాంతమంతయు దద్దరిల్ల బ్రశ్నించెను. అంత మన శారదయు మెల్లన నాతని జేరి ప్రేమతో 'నాయనా, నాతో నరుదెంచినవారు ముందరుగుటచే నే నొక్కతెనే యగుటచే మార్గము దెలియకున్నది. నాకు తోవజూపిన, వారలగలుసుకొందును' అని పలుకుచుండ నాతనివెంట నింకొక స్త్రీయు నట కరుదెంచెను. ఆతని కామె భార్యగ గ్రహించి మన శారదయు నామెవద్దకు జని 'అమ్మా, నేను నీ కుమార్తె శారదను. తోవ నెరుగని స్థితిలో నున్నాను. నాపుణ్యమున మీ రిరువురు యిట కరుదెంచితిరి' అని కల్లకపటము లెరుగని మాటల వచింప, వారును ఆ మృదుమధుర వాక్యములకు లొంగి, ఆమెను దమ పుత్రిగనే భావించి, దగ్గరగల చిన్న గ్రామమునకు గొంపోయి, నాటిరాత్రి యామెకు ఫలహారమునుగూడ నొసంగి, మరుసటిదినము ప్రాతఃకాలమునన్తే

ఆమెను వెంటగొంపోయి తారకేశ్వరముననున్న శారద మిత్రబృందమునకు ఒప్పగించి, మన శారదను గొంతదూరము సాగనంపి రాదంపతులు. కన్నుల నీరునిండ 'శారదా, మమ్ములను మరువకు' మని పల్కుచు వారు వీడ్కోలునొసగ శ్రీ శారదయు వారిని వదలజాలక 'మీరు దక్షిణేశ్వరమున కొకసారి వచ్చుచో నానందింతు' నని వారల నాహ్వానించెను. పిదప గొన్ని దినములకు వారట్లే దక్షిణేశ్వరమునకే తెంప శ్రీశారదారామకృష్ణులు వారిని గౌరవించిరి. వారును చాల సంతోషించిరి. ఆ ప్రేమప్రభావ మెట్టిదో యోచింపుడు!

వచ్చినవా రెట్టి వారైనను మనశారద వారి దుర్గుణముల జూడక బుత్రప్రేమతో నాదరించును. మరియు భోజనమిడక బోనిచ్చెడిదికాదు. శిష్యుల కొరకై భక్తులకొరకై యామె ఫలహారముల జాగ్రత్తపరచెడిది. ఎవ్వ రెట్టి సహింపరాని దుష్కృత్యముల నొనర్చియున్నను, పశ్చాత్తాపముతో వారు మన శారదను బ్రార్థించినచో నామె సంపూర్ణ హృదయముతో నాతప్పుల సైరించి వారిని సక్రమమార్గమున బ్రవేశపెట్టును. ఆమె యేనాడును బరుల దోషముల గమనింప కుండుటయేగాక నితరుల నెట్టి నిందా వాక్యముల నైన మనస్సు నొప్పించెడిదిగాదు.

జయరామవటిలో శ్రీశారదాదేవి గృహనిర్మాణమునకు సమీపగ్రామమందలి కొందరు మహమ్మదీయులు గొనిరాబడిరి. వారు పూర్వము పట్టుపుర్వుల బెంచు వృత్తియం దుండిరి. కాని యది సాగకపోవుటచే వారు చోరవృత్తి నవ

లంబించిరి. శ్రీ శారదాదేవి కీవృత్తాంతమంతయు దెలిసినను వారిని వెడలగొట్టలేదు. ఆమహమ్మదీయులలో నొక డొకదినమున అరటిపండ్లనుదెచ్చి శ్రీ రామకృష్ణదేవుని కర్పింపగోరుచు మన శారదాదేవి కొసంగెను. అటనున్న కొందరు భక్తులు 'అమ్మా, యతడు దొంగతనమును వృత్తిగా గలిగినవాడు. వాడిడిన ఫలముల నెందులకు గైకొందు రని శ్రీ శారదామాయిని వారు వారింపబోవ నామె 'వారి మంచిచెడ్డల విషయములు వారి యోగ్యతాయోగ్యతలు నాకు దెలియును లెమ్మ' యని వచించి, ఆఫలముల గురుదేవునకు నివేదించెను. ఆఫలగ్రహణముతో వాని దుర్వృత్తులగూడ నామె స్వీకరించినదేమో ఎవరికెరుక ! అట్టి మహాత్ముల చైదములు తెలియరానివిగదా ! వా రేకార్య మొనరించినను అందంతరార్థ మిమిడియే యుండును. ఆ విశేషముల గ్రహింప వలయుననిన 'తత్వశ్యేదగ్ర్యయా బుద్ధిః సూక్ష్మయా సూక్ష్మ దర్శిభిః' బ్రహ్మమును వీక్షింపవలెనన్న సూక్ష్మాతిసూక్ష్మమగు బుద్ధి కావలయును. అటులే మన శారదను గూర్చియు గ్రహించుట ! ఆమె మూర్తిని గాంచుచో ప్రేమయే ఘనీభవించి భక్తుల ననుగ్రహించు నిచ్చచే నిట్లు లోకమున నవతరించియుండనోపు నను నమ్మకము గల్గును.

ఒక పర్వదినమున, శ్రీశారదాదేవిని యనేకులు దర్శింప వచ్చిరి. వారి నందరిని ప్రేమతో దగ్గర కూర్చుండ బెట్టుకొని యున్నది మన శారదామాయి. అకస్మాత్తుగ నామె మనస్సు యెట్టి ధ్యాన నిమగ్నత నొందెనోగాని 'ఈ జన్మమునసే

మీకు ముక్తి ప్రాప్తించునుగాక యని నేను మిమ్ములనాశీర్వదించుచున్నాను. ఈ జనన మరణములనునవి దుఃఖభూయిష్టములు. కాన వాని బాధ మీకికనుండక భవపాశముల నతిక్రమించి యుండుడు' అని యీ సుఖదుఃఖరూపమగు ప్రపంచమునగల వారి వీక్షించి యామె పలికెను. నాడామెచే నట్లాశీర్వాదమును బొంది జననమరణ దూరులై వెలుగొందిన వ్యక్తుల జీవితములు ధన్యములుగదా !

అందుచేత మన శారద యొక శిష్యునితో 'నిర్మల ప్రేమయే మనకు గావలసినది. అట్టి ప్రేమమూలముననే యీ శిష్య సమూహమంతయు నభివృద్ధి గాంచుచున్నది. సర్వ ప్రపంచమునకు నేను మాతృదేవి నగుటచే నేనుగాక నా బిడ్డల నింకెవరు ప్రేమింతురు' అని బలుకుట జూడ నామె హృదయకుహరమున నెంత విశ్వమానవ ప్రేమ పొంగి పొరలుచున్నదో ఆధ్యాత్మికాభివృద్ధికై తహతహలాడు నెట్టి వ్యక్తికైనను హృదయము కరిగి నేత్రయుగ్మమున ఆనందాశ్రువులు రాలకమానవు. లోకమున గల సమస్తమానవులచే 'అమ్మా' యని పిలిపించుకొను ఆమాతృమూర్తిని గనుగొనుటకై, ఆచల్లని జ్ఞానదీప్తిని బొందుటకై, ఆమె పాదపద్మముల దరి జేరుటకై, కైవల్యపదవి నొందుటకై ఎవ్వడు కాంక్షింపడు? కావున శ్రీ శారదామాయి పూర్వము దక్షిణేశ్వరమున నున్నపు డొకపర్యాయము ఆమె జననియగు శ్యామసుందరి శారదకు బిడ్డలు లేరని వగచెను. దానిగాంచి మన రామకృష్ణుడు 'అమ్మా'యను వేలకొలది పుత్ర పుత్రికలు ఆమెకు గలుగగలరు' అని సమాధాన మొసంగెను. ఇట్లు

యాధ్యాత్మిక పథావలంబులై ప్రపంచము నుద్ధరించిన శ్రీశారదా సంతానముకంటె నధికు లెవ్వరుగలరు ? ఒకరిద్దరికి మాత్రమే దల్లిగాక సర్వప్రపంచమునకు శాశ్వత బ్రహ్మజ్ఞాన భిక్ష నొసంగి తల్లియై తనరినది మన శారదామాయి. అందు చేతనే 'Holy Mother' పవిత్రమాత యని నేటికిని మన మెల్ల రము ఆమెను బిలుచుచున్నాము. వర్తమానమున నేగాక నీ ప్రపంచ మున్నంతకాలము ఆమెను దలంచుచు జేయెత్తి మ్రొక్కుచు, నామె నాదర్శముగ గొని, అజ్ఞానాంధమును బాసి, జ్ఞానజ్యోతిని వెలిగించి, లోకపూజ్యులు కావలసిన వారెందరో మనమూహింప జాలముగదా! ఇట్టి పుత్రుల బడ యుట అందరికి సాధ్యమా! భక్తిజ్ఞాన వివేకముల నర్థింపగనే యొసంగుచు, వారి దోషములబాటింపక మంచినే గ్రహించుట ఎల్లరకు సాధ్యమా? మరియు సర్వమునకు శాంతి సందేశముల వెదజల్లు తమ నిష్కాపట్యమును వెలువరించుట వీరికిగాక నేరికి దరము?

ఇట్లు, తన సాన్నిధ్యమున కరుదెంచిన వ్యక్తులచే ప్రేమింపబడుటయేగాక, బూర్వము మున్నెన్నడును జూడని వారినైనను తన సన్నిధికి రప్పించుకొను యాత్మశక్తియు మన శారదయం దంతర్గతమై యొప్పెను. దేహ ధన బుద్ధిబలముల కంటె సర్వశక్తిగల 'అతతీ వ్యాప్నోతీతి ఆత్మా' అనురీతి సర్వ వ్యాప్తమైన యాత్మశక్తిగల వారెట్టి సంకల్పమును జేసినను, అది జరిగి తీరును. ఆయాత్మశక్తి లభ్యము కావలెనని శ్రీశారదాదేవి పలుమా రుపదేశించు పవిత్రతను సంపాదింప వలయును. పరమపవిత్రకు బట్టుకొమ్మయగు నామె కసాధ్య

మేమున్నది! అందుచేతనే యామె తన శక్తిత్వమునుగూడ గొన్ని సమయముల వ్యక్తమొనరించుట గాననయ్యెడిని.

వంగదేశమున సుప్రసిద్ధ నాటకరచయితయు, గొప్ప వక్తయు, శ్రీ రామకృష్ణుని శిష్యుడును అగు గిరీశచంద్ర ఘోషు శ్రీగురుదేవుని సన్నిధానమున జేరక పూర్వము కల కత్తలో దన పందొమ్మిదవ వత్సరప్రాయమున దారుణమైన వ్యాధికి గురియయ్యెను. వైద్యులుగూడ దమ యశక్తతను వెలిబుచ్చిరి. అట్టి విషమ దినముల నొక రాత్రి యాతనికి స్వప్నమున నొక కాంతికందుకము గోచరించి, క్రమముగ నది విశ్వవ్యాప్తమై యందుండి యొక దేవతామూర్తి యాతని దరి జేరి, యాతని బాధను గాంచి, గిరీశుని వదనమున నేదియో నొక ప్రసాదము నునిచి యంతర్హితమయ్యెను. నాటినుండి యతడు క్రమముగ నారోగ్యము బొందెను. కాని తనకు స్వప్నమున గనుపించిన మూర్తి యెవరో యని మనమున భావించుచునే యుండెను. ఒక్కొక్క పర్యాయము తన పసితనముననే దివి కేగిన జననియే పుత్రప్రేమచే నట్లు వ్యక్తమైనదేమో యనియు నతడు తలంచెను. కొంతకాలమునకు శ్రీరామకృష్ణు సన్నిధానమున కేగి, అతని ననుసరించి, ముఖ్యశిష్యుడై గిరీశుడు జీవితమును సార్థక మొనరించుకొనెను. శ్రీరామకృష్ణదేవుని నిర్యాణానంతరము గురుదేవుని శిష్యుడైన నిరంజనానందునితో నొకసారి జయరామవటికి శ్రీశారదాదేవి దర్శింప నితడు ఏగెను. గిరీశచంద్రుడు శ్రీశారదను దర్శించుట యిదియే ప్రథమము. గృహములోని కేగి యందాసీనయైయున్న మన శారదను వీక్షించి, ప్రణామమాచరించి, నిర్నిమేషుడై యాశ్చర్య

చకితుడై వెలుపలి కేతెంచి, తీవ్రయోచనా నిమగ్నుడై యుండెను. దాని గమనించి నిరంజనానందుడు ప్రశ్నింప 'నిరంజన్! గిరీశుని పందొమ్మిదవ యేట గోచరించినది మీరేనా? యని యమ్మను అడిగిర' మ్మని గిరీశుడు అతని గోరగ, నాతడు లోనికరిగి మన శారదను బృచ్ఛ సేయ 'అవును, నేనే' యని నేటికైనను తన బిడ్డ తనను గుర్తించెనుగదా యని యానందాంబుధి నోలలాడుచున్నదో యనునట్లు మందహాస వదనారవిందయై మెల్లగ నామె సమాధాన మొసంగెను. నాటినుండి శ్రీ శారదాదేవి యనిన గిరీశున కపరిమిత పూజ్యభావము ఏర్పడెను. మరియు నాత డానందమున 'నిరంజనుని అనుగ్రహముచే నేను మా యమ్మను గుర్తెరింగితి' నని పలుమారా విషయమును దలంచుకొని యానందబాష్పముల విడుచును. అపుడపుడు కసిరికొట్టు తల్లిని గనుగొనిన వెంటనే యానందింతుమే! ఇక మన జీవిత నౌకకే చుక్కానియై, దుఃఖసంద్రమును దాటించి, భవపాశ విముక్తికి హేతుభూతమగు జగజ్జననియగు శారదను వీక్షించి సంతసింపక నింక నేరిని గాంచి యానందించుట!

అట్టి పాపుల బతితుల నెందరినో తన అవ్యాజాను రాగముల దరిజేర్చి, వార కల్మషప్రాశనము గావించిన పతిత పావనరూపిణి మన శారద. అందువలననే 'గంగా పాపం శశీ తాపం దైన్యం కల్పతరుస్తథా। పాపం తాపం చ దైన్యం చ హంతి సజ్జనదర్శనం॥' గంగ పాపమును, చంద్రుడు తాపమును, కల్పతరువు దీనత్వమును మాత్రమే దొలగింప సత్పురుషుల దర్శనము పై త్రయమును నివారించుననిగదా శాస్త్రోపదేశము!

'సత్సంగత్వే నిస్సంగత్వం నిస్సంగత్వే నిర్మోహత్వం । నిర్మోహత్వే నిశ్చలతత్త్వం నిశ్చలతత్త్వే జీవన్ముక్తిః ॥' సత్సంగమున సంగరాహిత్యమును, దానిచే నిర్మోహత్వమును, దానిచే నిశ్చలతత్వమును, అద్దానిచే జీవన్ముక్తియనియు శంకరుడు సత్సాంగత్య మెట్లు ముక్తిదాయకమో బోధించియున్నాడు. ఇట్లే 'జాడ్యం ధియో హరతి......' సత్సంగతి బుద్ధిజాడ్యమును దొలగద్రోయును. వాక్కునకు సత్యమును ప్రసాదించును అని వివరించుచు, శ్లోక నాల్గవపాదమున 'సత్సంగతిః కథయ కిం న కరోతి ?' సత్సాంగత్యమేమి చేయజాలదో వచింపుము అని దాని ఫలితములగూర్చి భర్తృహరి మనలనే ప్రశ్నించెను. ఆ మహాత్ముల సాంగత్యమాధుర్యమును అనుభవించినవారదృష్టవంతులు గదా! అది లభ్యము కావలయుననిన బూర్వజన్మ సుకృతము గావలయును.

ఈ విధముగ మరియొక సంఘటనముగూడ జరిగెను. లాహోరు పట్టణమున నొక రైల్వేయుద్యోగి యొకనాడు తన ఆఫీసులో వ్రాసికొనుచుండ, నాతని బల్లమీద రక్తవర్ణపుటంచు వస్త్రమును, పాదములును గోచరించెను. కవాటములు యథారీతి నున్నను, లోనికెవరు ఎట్లు ప్రవేశించిరోయనియు, వారెట్లు బల్లపై కెక్కిరో యనియు నతడు దలంచుచు, వంచియున్న శిరస్సును పైకి ఎత్తెను. ఆతనికి భువనభోంతరాళములునిండ నొక యమానుష శక్తిస్వరూపము గన్పడెను. ఎట కంతమో తెలియలే దామూర్తి. వెంటనే యాత డున్మత్తుడై ఆఫీసు వదలి పరుగెత్తి పోయెను. ఎటకు ? ఎవరికొరకు? ఏమో! ఎవరికి దెలియును! అతనికిగూడ దెలియ

దేమో! అట్లు అనేక గ్రామముల దేశముల వెర్రివానివలె దిరుగుచు, లోకము అతని బిచ్చివానిగ జూచుచుండ, బిల్లలచే నూరూర దరుమబడుచు, ఒక్కొక్కతడవు వారిచే దెబ్బలగూడ ననుభవించుచు, అయినను వారి దూషింపక నగుచు, దేశముల దిరిగి, యొకనాటి మధ్యాహ్నమునకు నతనికి దెలియకుండకయే, జయరామవటి కరుదెంచెను. పిల్లలు యీ పిచ్చివాని గాంచి రాళ్ళు రువ్వుచు, నాతడు బాధనొంద దిలకించి నవ్వుచు వెంటాడిరి. అవును, 'పిల్లలయాట కప్పలకు జేటటులగు' అనునట్లు, వీరియాటలు ఆతనికి బాధను గల్గించును గాని యీ బాలుర కేమి బాధ? ఇట్లాతడు పిల్లలు వెంటాడ, నొక గృహ ప్రాంగణమున ప్రవేశించెను. ఆ గృహమే పవిత్ర మాతృదేవియగు మన శారద నివాసస్థానము. ఆమె కపుడు అస్వస్థతగ నుండుటచే శ్రీ శారదానందస్వామి కలకత్తనుండి వచ్చియుండి, యామె విశ్రాంతికి దగు నేర్పాటుల గావించెను. గదియందు శ్రీ శారదాదేవి విశ్రాంతిగైకొనుచుండ నెవ్వరు ఆటంకపరుప వీలుగాకుండ గట్టుదిట్టముల శ్రీ శారదానందుడు గావించెను. అట్టి సమయమున నీ పిచ్చివాడు వచ్చుటయు, వెంట బాలకసమూహ మేతెంచి గోల సేయుచుండుటయు నాతడు చూచి, మెల్లగ నటకేగి, గోల సేయవలదనియు, వెళ్ళుడనియు వారి నాజ్ఞాపించుచుండెను. ఈ యలజడిని విని శ్రీ శారదాదేవి తలుపుల దెరచెను. ఆ శబ్దమునకు పిచ్చివా డాదెసకు జూడ, మన తల్లి శారద అతని లోనికిరమ్మని సంజ్ఞ జేసెను. వెంటనే పిచ్చివాడును మారు బలుకక లోనికేగెను. అంత శారదామాయి మరల కవాట

మును బంధించి, పదినిమసములతర్వాత నతని బయటికి బంపెను. అంత నావెఱ్ఱివా డానందమున బఱ్ఱెత్తుచు, 'నెట్టకేలకు గనుగొంటి' నని బల్కుచు, వెడలిపోయెను. అతని వెంట నాశ్చర్యచకితుడైన శారదానందుడును అరిగి, అతని వలన సర్వమును గ్రహించి ఆమె కరుణకు నానందించెను. అట్లు ఏ కొలది శిష్యులకో నామె శక్తిత్వమును వ్యక్తమొన రించి వారిని దరింపజేసెను. వారి ధైర్యస్థైర్యత్యాగముల బరీక్షించియే యామె తన స్వరూపమును జూపుచుండెడిది.

## ఉ ప దే శా మృ త ము

ఏవ్యక్తి త్రికరణశుద్ధి కలిగియుండునో, విరాగసంపన్నుడగునో, మనోహృదయముల సమైక్యతను గాంచునో, సాధనామగ్నుడగునో, జ్ఞానాధిక్యతచే ప్రేమ ఘనీభవించునో అట్టి వ్యక్తి సాధక, భక్తకోటికి వివరించు వాక్యములే ఉపదేశములై యొప్పునుగాని, ఆచరణ విహీనులై, 'వాచా విరక్తాః క్రియయా అనురక్తాః' అను చందము వాచా విరక్తులవలెనుండి క్రియలచే ననురక్తులైనవారి వాక్యము లుపదేశము లనజెల్లునా? 'పరోపదేశ వేళాయాం సర్వే వ్యాస పరాశరాః' పరుల కుపదేశించు సమయముల నెల్లరును వ్యాసపరాశరులు కావచ్చును గాని ఆపలుకులు తమ అనుష్ఠానమున లేనిచో నిక ఆ బోధలచే ప్రయోజనమేమి? పవిత్ర వ్యక్తియగుచో నాయుపదేశ సంచయ మాచంద్రతారార్కముగా వెలుగొంది, ముముక్షుజనుల

హృదయమునజొచ్చి వారికి శాంత్యానందముల బ్రసాదించును. అందుచేత 'పవిత్రం చరితం యస్యాః పవిత్రం జీవనం తథా। పవిత్రతా స్వరూపిణ్యై తస్యై దేవ్యై నమోనమః॥' ఎవరి చరిత్ర అనగా పరులకు దెలిసిన బాహ్యాచరితము పవిత్రమో, ఎవరి జీవనము అనగా దనకు దెలిసిన దంతయు బవిత్రమో, మరియు నెవరి స్వరూపము అనగా నితరులకు గాని తనకుగాని దెలి యనిదిగూడ బవిత్రమో అట్టి పవిత్రతాస్వరూపిణియగు శారదా దేవికి నమస్కారము అని శ్రీ అభేదానందస్వామిచే గీర్తింప బడి, పవిత్రత కాటపట్టగు మన శారదామాయి తా నాచ రించి అనుభవ పూర్వకముగా నుడివిన వాక్యసంచయముగాన నా యుపదేశతతి బహుముఖముల సాధకుల హృదయ సంక్షో భముల నరికట్టు శక్తియుక్తములై యున్నవనుటయం దెట్టి సందియమునులేదు. తాను తరించిగదా ప్రపంచ తారణో పాయమును దెల్పుట. 'స్వయం తరితు మక్షమం కథ మసౌ పరాన్తారయేత్ ?' తన్నుతాను తరింపజేసికొనలేని అసమర్థుడు పరుల నెట్లు తరింపజేయు ననునట్లు ఆమె శిష్యులకు జెప్పి చేయించుటయే గాక దా నాచరించియే జూపెడిది. అనగా నామె జీవితమునే ఆదర్శముగ మనము జూడగలము. ఆమె యుపదేశవాక్యములుగూడ గేవలము గృహస్థులకును, కేవలము సన్న్యాసులకును, కేవలము స్త్రీలకును, పురుషులకును మాత్రమేగాక అవి అందరికి నన్వయించును. సర్వసమత్వము జాటు వారలకట్టి పక్షపాతబుద్ధి యుండదుగదా ! ఆ యుప దేశములన్నియో అతి మృదు మధురములై యలరారుచుండును. మహాసంద్రమున ముత్యములు రత్నములు వెలయుచుందమున

శ్రీ శారదా దేవియొక్క సరళ గంభీర వాక్సుధా సాగరమునందు అంతర్గతములై ఆమె యుపదేశవాక్యములు వజ్ర వైడూర్యములకంటె నమూల్యములై యొప్పారును. వాని మన జీవితమున ననుష్ఠించినచో ధన్యులము గదా! కాన గొన్ని యుపదేశ వాక్యముల నిట నుదాహరింతును.

'ఆసన ప్రాణాయామాభ్యాసముచే సిద్ధులు కలుగును. కాని సిద్ధులు మానవుని అపవిత్రమార్గమునకు గొనిపోవును.' సాధకుని చిత్తమున కేకాగ్రత ప్రాప్తించుకొలది అనేక శక్తులును అలవడుచుండును. ఆశక్తుల ప్రాపంచికముగ నుపయోగించుచో సామాన్యులు వానిచే నాకర్షింపబడి అతని జేరుదురు. ఆ సిద్ధుల శక్తియు రానురాను ఆకర్షణదూరమై ఆవ్యక్తి సామాన్యుడే యగును. అనగా భగవదభిముఖ మగుచున్న నా మనస్సు ప్రపంచాభిముఖమగుటచే నాతని బలితునిగా జేయునుగాని భగవద్దర్శనాదుల బ్రాపిలజేయదు. శ్రీ రామకృష్ణు డొక పర్యాయము నరేంద్రుని (శ్రీ వివేకానందుని బాల్య నామము) బరీక్షించుటకో యనునట్లు 'నరేన్! నీకు గొన్ని శక్తులు కావలయునా?' అని ప్రశ్నించెను. 'అవి ఎట్టి శక్తులు? వానిచే భగవత్సాక్షాత్కారము లభ్యమైనచో స్వీకరింతును. లేనిచో అవి నాకేల?' అని ఆ బాలుడు సమాధాన మొసంగ గురుదేవుని హృదయము కడుంగడు ఉప్పొంగెను. ఎందులకు? అట్టి శక్తుల నిస్సారముగా ద్రోసినందులకు. అట్టి సిద్ధుల నతీతించి పోవువానికే బ్రహ్మానంద రసాస్వాదనము.

'భార్యాభర్తలు ఆధ్యాత్మిక సాధనలయం దేకాభిప్రాయము గలవారైయున్నచో సక్రమాభివృద్ధి వారికి త్వరితగతి

గల్గును.' అవును, రథమునకుగాని, శకటమునకుగాని, బూన్చిన గుఱ్ఱములు ఒకేరీతి బరువిడిన గమ్యమును శీఘ్రముగ జేరగలవు గాని, వానిలో నెద్దియేని వెనుకకు నడచిన ప్రయోజనము గలదా ? అట్లే యీ సంసారశకటమునకు బూన్పబడిన భార్యాభర్తలు ఏకాభిప్రాయమున సక్రమ సాధనావిధానముల నాచరించిన ముక్తి సత్వరముగ బడయగలరు.

'ఈ ఐహిక వస్తువాహనాదికమంతయు మాయతో గూడినది. అందుచే నీ బంధములనుండి విడివడిననే కైవల్య ప్రాప్తి. ఈ బంధముల దెగగోసినగాని సంసారసంద్రపు టావలిదరిని జేరజాలవు.' 'కర్తృత్వాద్యహంకార సంకల్పో బంధః' కర్తృత్వాది అహంకార సంకల్పమే బంధముగ నిరాలంబోపనిషత్తును, 'మమేతి బధ్యతే జంతుః' ఆ మమకారాదులచే జీవి బంధింపబడుచున్నదని మహోపనిషత్తును వాకొని యున్నవి. మరియు వివేకానందుడును 'రాగద్వేషములును గూడ బంధనములె' అని ఉద్బోధించియున్నాడు. అట్టి అహంకార మమకార త్యాగముచేతనేగదా ముక్తి సాధ్యము. అదియేగదా సర్వోపనిషచ్ఛాస్త్రార్థ సారము. త్యాగమువలన మాత్రమే శాంతియనియుగూడ 'త్యాగాచ్ఛాంతి రనంతరం' అని గీతావాక్యము గదా.

'ఇరువురు బిడ్డల గనిన బిమ్మట భార్యాభర్తలు తమ వాంఛల ద్యజించి సోదరీ సోదరులవలె జీవింపవలయు' నని శ్రీరామకృష్ణులు బోధించెడివారు. ఆత్మనిగ్రహము అత్యంతావసరము. అదిలేనిచో భగవత్సాక్షాత్కారప్రాప్తి దూరము'. అందువలననే 'యదా సంహరతే చాయం కూర్మోఙ్గానీవ

సర్వశః। ఇంద్రియాణీంద్రియార్థేభ్యస్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా॥' కూర్మ మెట్లు తన యవయవముల లో నిముడ్చుకొనునో అట్లే యెవడు ఇంద్రియముల విషయములనుండి మరల్చునో అనగా గ్రహించునో, ఇంద్రియజయము గాంచునో వానిప్రజ్ఞ స్థిరమైనదని గీతాకారుడగు శ్రీ కృష్ణభగవానుడు వక్కాణించియున్నాడు.

'ప్రపంచవిషయములయం దెంత విముఖతగలుగునో యంతకు మించు మనశ్శాంతి లభ్యమగును.' ప్రకృతి పాంచభౌతిక మగుటచేతను 'పరాంచిఖాని వ్యతృణత్ స్వయంభూస్తస్మాత్ పరాన్పశ్యతి నాంతరాత్మన్' ఇంద్రియముల నాజతుర్ముఖుడు బాహ్యముఖములుగ సృజించుటచే నవి బాహ్యమునే గాంచు నను కఠోపనిషద్వచనసరణి నీ యింద్రియములును బాంచభౌతికమగు బ్రపంచము దెస బర్విడి విషయముల ముంప జూచును. అట్లు ఆ యింద్రియానుగత జీవులు దుఃఖోదధి యగు సంసారమున మ్రగ్గుచు బాధల ననుభవింతురు. కావుననే బాహ్యప్రపంచ విషయాసక్తిపరులకు మోక్షము దూరమనియు, అర్థాని ద్యజించుమనియు శాస్త్రాదేశము. 'న శబ్దశాస్త్రాభిరతస్య మోక్షో న చైవరమ్యావసథ ప్రియస్య। న భోజనాచ్ఛాదన తత్పరస్య న లోక చిత్తగ్రహణే రతస్య॥' శాస్త్ర శబ్దముల రతుడైన వానికిని, రమ్యప్రదేశముల వసించు కాంక్ష గలిగినవానికిని, భోజన వస్త్రాదుల బుద్ధి గలవానికిని, లోకుల చిత్తగ్రహణాసక్తునకుగాని మోక్షము లభ్యమనియే మన శాస్త్ర వచనములు. అందుచే బై విషయ విముఖతచే నంతఃకరణమున మార్పు జనించిన శాంతి సిద్ధించును. కావుననే శ్రీ వివేకా

నందుడు శాంతికాముకుఁడైనచో 'ప్రపంచవిషయముల దృప్తిని, ఆధ్యాత్మికవిషయముల నసంతృప్తిని గల్గియుండు'డని యెల్గెత్తి చాటియున్నాడు. మనశాస్త్రములును 'సంగం త్యక్త్వా సుఖం వ్రజేత్' సంబంధము విడిచి సుఖమును బొందవలయునని వాకొనుచున్నవి. మరియు శ్రీకృష్ణపరమాత్మ గీతలోఁగూడ 'విహాయ కామాన్ యస్సర్వాన్ పుమాంశ్చరతి నిస్పృహః। నిర్మమో నిరహంకారః స శాంతి మధిగచ్ఛతి ॥' ప్రపంచముపై గోర్కుల బోనాడి, నిస్పృహుడై మమకారాహంకారదూరుడైనచో శాంతి బడయుననియే గదా నొక్కి వక్కాణించెను !

'మనస్సున కొక్క క్షణమైనను విశ్రాంతి నొసంగరాదు. ఇచ్చితివా యది యనేక దురాలోచనలఁజేయును. కాన దానిచే నెప్పుడును నెద్దియేని పనిని జేయించుచుండవలెను. ఇట్లు జేయగా విరాగము గలుగును. మనస్సు మదగజము వంటిది. కాన దాని నెల్లప్పుడును వివేకముతోఁ గనిపెట్టుచుండవలెను. సర్వము మనస్సుపైననే యాధారముగదా !' అవును, 'మన ఏవ మనుష్యాణాం కారణం బంధ మోక్షయోః' చిత్తమేగదా సర్వానర్థములకును, మోక్షమునకును గారణమగుచున్నది. కావ మనస్సు శుద్ధాశుద్ధ రూపమున ద్వివిధమనియు 'అశుద్ధం కామసంకల్పం శుద్ధం కామ వివర్జితం' కామసంకల్ప యుక్త మశుద్ధమనియు, కామదూరమైనది శుద్ధ చిత్తమనియు, 'చిత్తే చలతి సంసారో నిశ్చలం మోక్ష ఉచ్యతే' కామ సంకలితమై చంచలించునపుడు సంసారమనియు, కామ వివర్జితమై నిశ్చలముగ నుండునపుడు, కైవల్యమనియు గదా శ్రుతు లుద్ఘోషించుట !

'హృదయ నైర్మల్యమునసనే భగవానుడు సాధ్యము. అట్టి హృదయముననే భక్తి నెలకొనును. నిష్కపట భక్తిచే సర్వము సాధ్యము. అట్టివారు భగవంతునికి మిక్కిలి యిష్టులు.' భగవత్సాక్షాత్కారము నొంద ప్రాపంచిక మాయను వర్జించి 'విద్వాన్ చరతి బాలవత్' అనురీతి అమాయకులై నిష్కపటులై జరింపవలయునని గదా శాస్త్రాదేశము.

'వాదములు చేయుట తగదు. వాదముచే బ్రహ్మము సాధ్యమా? తర్కముచే భగవదనుభూతిని బొందుట స్వప్నము వంటిది.' అందుచేతనే గదా 'నైషా తర్కేణ మతిరాపనేయా' బ్రహ్మము తర్కముచే నూహింపబడదు అని శ్రుతుల యాదేశము. అంతియగాక 'అచింత్యాః ఖలు యే భావాః న తాం స్తర్కేణ యోజయేత్' విచారణజేయుట కసాధ్యమగు భావముల దర్కముచే దీర్మానింపరాదు అనునట్లు సర్వలక్షణదూరమును అతీతమును అగు బ్రహ్మవిషయమును దర్కించుట వెర్రి యగునుగదా!

'ఆధ్యాత్మికబోధ అందరికి జేయుటకు వీలులేదు. ప్రథమమున అర్హత యుండవలెను. అర్హతయున్నప్పుడే బోధ కర్హులు.' అర్హత యననేమి? అధికారి యననేమి? ధనమున్న నధికారియా? విద్యాభ్యాసముచే నర్హత యరుదెంచునా? మన శాస్త్రములు కాని, విరాగసంపన్నులగు మహాత్ములు కాని యధికారి నిర్ణయముసేయక ఆధ్యాత్మికబోధను గావించుటలేదు. అందుచేత శ్రీ శంకరభగవత్పాదులు 'అథాతో బ్రహ్మజిజ్ఞాసా'

అను బ్రహ్మసూత్ర గ్రంథస్థమగు ప్రథమాధ్యాయ, ప్రథమ పాద, ప్రథమాధికరణ, ప్రథమ సూత్రమునకు బ్రథమమున 'అథ' శబ్ద నిర్వచన మొనరించుచు, నిత్యానిత్యవస్తు వివేకము, ఇహాముత్ర ఫలభోగవిరాగము, శమాదిషట్క-సంపత్తి, ముముక్షుత్వము నాబడు సాధన చతుష్టయానంతరము బ్రహ్మజిజ్ఞాస సలుపవలయునని దృఢముగ నధికారి నిర్వచనము గావించెను. కావుననే, 'శిష్యు డర్హుడైనచో యుపదేశింపుము. అనధికారి కుపదేశించినచో రౌరవాది నరకముల ద్రోయబడుదువు సుమా' అని గురువునకు శాస్త్ర మాదేశించుచున్నది. సర్వము అర్హతపైన ఆధారముగదా !

'సాధనలచే గర్మబంధముల ఛేదింప వచ్చును. జప ధ్యానములు చాల ముఖ్యము. క్రమముతప్పక వానిని నియమముతో నాచరింపవలెను. వీనిచే నింద్రియనిగ్రహము సాధ్యము.' తీవ్రసాధనచే భగవంతుడు శీఘ్రగోచరము. లోకమునగల సర్వధనములు నశించునుగాని సాధనైశ్వర్యమో మనల శాశ్వతమగు నిర్వాణపదవి నధిష్ఠింప జేయును.

'చలువ చేయబడిన వస్త్రమువంటివాడు సన్న్యాసి. నల్లనివస్త్రము వంటివాడు గృహస్థుడు. తెల్లనివస్త్రముపై చిన్న మచ్చగూడ బ్రస్ఫుటముగ గోచరించు విధానమున సన్న్యాసి జీవితమునగల లవలేశ కళంకమైనను నత్యంత విదితమై యుండును. కావున నీ కామకాంచన సహిత ప్రపంచమున వారు కడుజాగరూకతతో మెలగవలెను. త్యాగ శాంతముల తోడి పవిత్రగాంభీర్యముతో నుండవలెను. అట్లు సర్వత్యాగులైన

వారు ప్రత్యక్షదైవస్వరూపులు.' త్యాగముచేతనేగదా లోక పూజ్యత! త్యాగమున్నగాని ఆనందము లేదు. కావున త్యాగరాజు రామభక్తి తన్మయత్వమున 'శాంతములేక సౌఖ్యము లేదు' అని కీర్తించుట వ్యక్తము.

'మానవునకు ఆశ యున్నంతకాలము యీజననమరణ పరంపరల బొందవలసినదే. ఆశవలననే శరీర పతనానంతరము మరల శరీరమును బొందును. ఆశాదూరులే జన్మ రహితులు. అట్టివారు కోటిలో నేయొక్కరో యుందురు.' ఆశయే సర్వానర్థములకు మూలము. సర్వప్రపంచము 'ఆశయా బద్ధతే లోకే' ఆశచే బట్టువడి యున్నది. మరియు 'తృష్ణా న జీర్ణా వయమేవ జీర్ణా' మనము నశించుచున్నను, యీ తృష్ణ నశింపదు. అందుచేతనే 'తృష్ణాం ఛింది' కోర్కెల ఛేదింపుము అని భర్తృహరి వచనము. కామనాశమేగదా ముక్తిదాయకము!

మానవజన్మము దుఃఖభూయిష్టము. భగవద్దర్శనమే సుఖము. భగవత్సాక్షాత్కారమే మానవ జీవిత గమ్యము.' కాన 'మానుషత్వం ముముక్షుత్వం సద్గురు సమాశ్రయః' మానుషత్వము, మోక్షేచ్ఛ, సద్గురువు లభించినగాని భగవత్ప్రాప్తి దుర్లభమని ఆర్యోక్తి.

'కేవల పాండిత్యముచే శ్రద్ధాభక్తు లలవడునా? మితిమీరిన చదువుచే చిత్తము కలవరమొందును. కాన శ్రీరామకృష్ణుడు 'భగవానుడు నిత్యమనియు, ప్రపంచ మనిత్యమనియు శాస్త్రములచే గ్రహింపవలయును' అని అంతమాత్రమే ఆ

గ్రంథముల ప్రాముఖ్యతను వివరించెను.' అందుచేత వివేకానందుడు 'గ్రంథముల గుళ్ళ వెదకిన గలదె ఫలము' అని హెచ్చరిక జేసెను. మరియు కేవల పాండిత్య ప్రధానులగూర్చి శాస్త్రము 'యే చ శుష్కాధ్యయనాసక్తాః యే చ శాస్త్ర విచింతకాః। సర్వే వ్యసనినో మూఢాః...' శుష్కాధ్యయనాసక్తులును, శాస్త్రచింతనము జేయువారలును వ్యసనముగల మూఢులని పేర్కొనినది. సాధనలేని గ్రంథజ్ఞానముచే సంశయములును, వానిచే నేదియు నిశ్చయమును బొందలేక అట్లే ఉండునుగాని శాంతిని సాధింపజాలడు. ఎవడు గ్రంథజ్ఞానము నవగతము జేసికొని దాని నాచరించునో వాడు జగద్వంద్యుడు, పండితవరేణ్యుడు. 'యః క్రియవాన్ స పండితః' అని గదా సూక్తి.

'జీవితము మూడుదినముల ముచ్చట. నేడున్న మానవ శరీరము రేపు ఉండదుగదా! జీవించినంతకాలము తాపత్రయమే యగుచున్నది' యని మనసా విచారించినచో వైరాగ్య ముదయించును.' 'జాయతేతి గచ్ఛతీతి జగత్' పుట్టుచు బోవుటచే జగత్తు అని నిర్వచింపబడిన ప్రపంచము అనిత్యమగుచున్నది. 'దహ్యతీతి దేహః' అను చందము యీ శరీరమును దహింపబడుచు నశ్వరమగుచున్నది. కావనే 'మహతా పుణ్యపణ్యేన క్రీతోఽయం కాయ నౌ స్త్వయా। పారం దుఃఖోదధే ర్గంతుం త్వర యావ న్న భిద్యతే॥' గొప్ప పుణ్యమను ధనముచే నీ దేహమను నౌక నీచే గొనబడినది. అది నశింపకపూర్వమే దుఃఖసంద్రపు టావలిదరికి బోవుటకు త్వరపడుము అని యీ శరీర క్షణికత్వమునుగూర్చి శాస్త్రము

బోధించుచున్నది. లంగరువేసిన పడవయం దాసీనుఁడై చుక్కాని వేయుచున్నను ఆ నౌక ఎట్లు ప్రయాణమొనర్పక యథాస్థానమున నుండునో అట్లే తాపత్రయములనెడు లంగరు దించిన యీ దేహమను పడవను సాధన యను చుక్కానిచే నడుప యత్నించి, విఫలుఁడై మానవుఁడు యథారీతిగ నివసించుచున్నాఁడు. లంగరును దొలఁగించినఁగదా నావ ఏఁగుటయు, గమ్యమును బొందుటయు జరుగును. వైరాగ్యోదయమే లంగరు వైదొలఁగుట యని అర్థము. ఆ వైరాగ్యముచేతనే మోక్షమను గమ్యమును జేరుట, ఆనందించుట, ఆనంద ప్రదాత యగుట. యథార్థ వైరాగ్యమగుచో తత్ఫలితము తప్పక గోచరమగును.

'జప తపములు, పూజలు, తీర్థయాత్రలు మొదలైనవానిని బసితనముననే గావింపవలయును. వార్ధక్యమున జవ సత్వములుడుగ, శక్తి సామర్థ్యములు వైదొలఁగ, మనోదార్ఢ్యము ప్రాప్తింప నిక జేయఁగల్గున దేమి ? చిన్ననాటినుండియు మనస్సును భగవంతుని దెస ద్రిప్పుట యుత్తమము. బాల్యమే భగవచ్చింతనకు సరియగు కాలము.' 'కౌమారే ఆచరేత్ ప్రాజ్ఞః' ప్రాజ్ఞుఁడు కౌమారమునందే ఆచరించు ననునట్లు బాల్యమునుండియే యత్నము చేయుచో దేనినైన సాధింపవీలగును. వైరాగ్యము జనింప గురుసన్నిధి జేరి, విద్యాభ్యాస మొనరించి, సాటిలేని పాండిత్యమును సంపాదించి, యత్యాశ్రమ స్వీకరణము గావించి, భాష్యత్రయమును రచించి, అనేక గ్రంథముల లిఖించి, దేశమెల్లెడల బర్యటించి, తన కీర్తి చంద్రికలు నల్గడల వ్యాపింప సర్వాధ్యాత్మిక సన్న్యాస సార్వ

భౌమునిగా విలసిల్లిన శంకరుడు పసితనమున గదా గృహ త్యాగము జేసినది! తండ్రి యంకతలమున నాసీనుడగుటకై సన్నద్ధుడగు బాలకుని బినతల్లి ఛీత్కారముసేయ, దాని నివి త్తముగా గొని, అరణ్యముల జేరి, ఉగ్రతపము గావించి విష్ణు సాక్షాత్కారము నొంది, ధ్రువతారయై వెలుగొందిన ధ్రువబాలకుడు బాలుడే గదా! అట్లే జనకుని విరోధియగు పాపహారి శ్రీ మహావిష్ణువును 'పానీయంబులు ద్రావుచున్ గుడుచుచున్' అనువిధాన సర్వదా భజించుచు, దండ్రి కలి గించిన బాధల క్షమతో భరించి, భక్తిని వీడజాలక 'హరి మయము విశ్వమంతయు' అని దృఢముగా బల్కి, స్తంభమున శ్రీహరిని నృసింహశక్తిగా నావిర్భవింపజేసిన భక్తాగ్రేసరుడు, నారాయణధ్యాన మనస్కుడగు ప్రహ్లాదుడు బాలుడే గదా! అందువలన 'బాలకులు గారె తొల్లిటి భాగవతులు' అని వచింప బడినది. దేనినైనను శైశవముననే సాధింప వలయునుగాని సర్వవిధముల క్షీణత్వము కలుగుచుండు ముదిమిలో సాధిం చుట అసాధ్యమే. ప్రాపంచిక విషయదూరమగు బాల్యమే గ్రహణ, ఆచరణముల కనువగు కాలము. అట్టివారు ఎన్ని వత్సరములు పైబడినను శిశుతుల్యులే.

'మనస్సు సహజముగ దుష్కార్యములవైపు మొగ్గు చుండును. సత్కార్యములనిన సోమరితనము జూపును. కావున సకల సత్కార్యములందును పట్టుదల, నియమపాలనము లావ శ్యకము.' అవును. జల మెట్లు అధోముఖమై ప్రవహిం చునో అట్లే మనస్సుకూడ అధోముఖమై ప్రపంచవిషయముల వెంట పర్విడుచుండును. దురభ్యాసము సులభముగ లభ్యము

గాని సల్లక్షణము లలవడుట గష్టసాధ్యము. ఇట్టి మనోగత భావజాలముల గ్రహించి, అనవసరముల ద్రికరణముగ ద్యజించి, అవసరముల ద్రికరణముగ స్వీకరించి, సాధనజేసినగదా నాధ్యాత్మిక సంపదల దులదూగుట !

కామ్యమనస్కులై జపాదుల జేయుచు, వానిచే భగవానుడు తమ కోర్కెల నెరవేర్చునని భావించువారితో నామె యిట్లు పలికెడిది. 'జపతపము లనెడు విలువ నిడి కొనుటకు భగవంతుడు కూరగాయలవంటి వస్తువు కాదు'. మానవులు కామ్యతతోడ జన్మించుటచే నాప్రాపంచిక వ్యాపార దృష్టినే మనస్సున నిడికొని భగవంతునితోగూడ వ్యాపారమునే సాగింతురు. తమ కష్టములు బోవుటకు దినద్వయము క్రమము తప్పక పూజాదుల జేయుటో, లేక జేయించుటో జరుగును. తదాదిగ వారికి 'ఇన్ని పూజల గావించినను, యింత జపమొనర్చినను దేవుడు తమ కోర్కెల దీర్పక బోయెనే' అను చింత కలిగి వంతలపా లగుదురు. అట్లుగాక గీతాకారుడగు శ్రీకృష్ణ పరమాత్మ బోధించురీతి 'కర్మణ్యేవాధికారః' కర్మల జేయుట యందుమాత్రమే అధికారము కలిగి, 'ఫలం త్యక్త్వా' అనునట్లు ఫలమును ద్యజించి, సర్వము భగవదర్పణబుద్ధితో గావించుట భక్తియగును. అనగా నిష్కామత్వ మలవడవలెనని కామ్య దృష్టిగలవారికి ఉద్బోధ అయి ఉండవచ్చునేమో !

'తీవ్రసాధన జేయువారికి ద్వరితముగ భగవల్లాభము కలుగును.' తీవ్ర ముముక్షుత్వ ఫలితమే తీవ్ర సాధనేచ్ఛ. ఆ తీవ్రసాధనాకాంక్షచే నా జన్మమునందే ముక్తిని బడయును. అందుచేతనే శ్రీరామకృష్ణుడు ముముక్షువులగూర్చి తీవ్ర, లేక

ఉత్తమ, మధ్యమ, అధములని మువ్విధముగ వివరించువాడు. 'యస్తు తీవ్ర ముముక్షు స్స్యాత్స జీవన్నేవ విముచ్యతే। జన్మాంతరే మధ్యమస్తు తదన్యస్తు యుగాంతరే। చతుర్థః కల్పకోట్యా వా నైవ బంధా ద్విముచ్యతే।' తీవ్ర ముముక్షువు జీవితకాలమునసే ముక్తినొందును. జన్మాంతరమున మధ్యముడును, యుగాంతమున నధముడును ముక్తిని గాంచ, నాల్గవవాడుమాత్రము కోటి కల్పములకైనను బంధవిముక్తుడుకాడని శంకరుడు తన సర్వ వేదాంత సార సంగ్రహము నా గ్రంథమున వివరించి యున్నాడు. ఆ తీవ్రముముక్షు వైరాగ్యమును 'పరం వైరాగ్యం' అని యోగసూత్ర గ్రంథము వాకొనెను. ఆ తీవ్రమోక్షేచ్ఛ యన్ననో భగవదనుగ్రహముచే బ్రాప్తమగును.

పై యుపదేశములన్నింట నక్షత్రముల నడుమ బ్రకాశించు జందురునిమాడ్కి ఆమె జీవితమునే మన కాదర్శముగ స్ఫురింపజేయు నుపదేశద్వయము శిరోభూషణమై యున్నవి. అందు మొదటిది 'నీవు శాంతిని గాంక్షించితేని బరుల దోసగుల జూడకుము. మరియు నీ లోపముల గాంచుట యుత్తమము'— ఇతరుల దోషముల నాలోచించుచు, బ్రసంగించు నంతదనుక అవియే సర్వవేళల జ్ఞప్తికి వచ్చుచు మనస్సున కశాంతిని గలిగించును. అట్లుగాక మన అవలక్షణముల గ్రహించి వాని సవరించుకొనినచో శాంతి లభించునుగాని పరలోప గ్రహణముచే శాంతి చేకూరునా? కాని 'ఇతర నేత్రమునగల సూక్ష్మమైన నలుసును గాంతురుగాని తమ కంటియందలి దూలమును గాంచజాలరు' అను ఏసుక్రీస్తు వాక్యానుగుణ్యముగ మానవ నైజము పరరంధ్రాన్వేషణమే. అట్లు బ్రతివ్యక్తియు

దన దోషములనే సవరణ మొనర్చుకొనిన ప్రపంచమున శాంత్యానందములు నాట్యము సేయవా? ఈ లోకమే స్వర్గ తుల్యమగునుగదా!

ఇక రెండవది. 'శుద్ధమనస్కులైన కెల్లరు పరిశుద్ధులుగనే గోచరింతురు.'— 'యద్భావం తద్భవతి' భావమెట్టులో అట్లే యగుచున్నది యని శాస్త్రము. ఏరంగు అద్దముల సులోచన ముచే ప్రపంచ మా రంగుగనే వ్యక్తమగును. అట్లే మన భావము ననుసరించియే యితరులగూడ మనము జూచెదము. మన లోపములచే మహాత్ముని సహితము దురాత్మునిగగాంచి, పాపమున కొడిగట్టుకుందుముగాని నిర్మల హృదయులు పాపాత్మునియందును మంచినే వీక్షించి యానందింతురుగదా! వారి హృదయమున ద్వేషము లేమిచే సర్వుల నొకేవిధమున బరికింతురు. కావున వారు సర్వావస్థల శాంతి నాస్వాదింతురు. అట్టి రాగద్వేషరహిత దృష్టి అందరకు సాధ్యమా?

పై యుపదేశ ద్వయమున 'పరుల దోషములగాక నీ లోపములనే గ్రహింపుము' అనుటచే మొదటిది సాధనా విధానమును, 'మనోపారిశుద్ధతచే నెల్లరు బరిశుద్ధులుగనే గోచ రింతురు' అనుటచే రెండవది పైసాధనాఫలితముగ హృదయ పవిత్రత సిద్ధించునని ఫలితమును సూచించుచున్నవి. ఈ ద్వయ మామె నిత్యజీవితమున నెట్లు మిళితమై ఎట్టి పరివర్తన గావించినవో మనము పూర్వమే గ్రహించి యున్నారము.

# అ స్త మ య ము

పై విధానమున మానవ జీవితప్రాధాన్యమును గ్రహించి నిజజీవితమును భగవత్పరము గావించి, దుఃఖసాగరమగు నీప్రపంచమున మ్రగ్గు మానవులపై దయదలంచి, వారిముక్తికై యుపదేశముల నొసంగి, భక్తుల సర్వపాపముల దానే గ్రహించుచు దన యమూల్య జీవితమును అల్పముగ భావించుటవలన మన శారదామాయికి శారీరక బాధ లధికమై 1919 వ సంవత్సరమున వ్యాధి యంకురించెను. ఆ జ్వరబాధ ఆమెను గడవరకు బీడించెను. అట్టి జ్వరబాధకు గురియయ్యును, ఆమె తన దర్శనార్థము అరుదెంచు భక్తులతో ప్రేమతో బ్రసంగించెడిది. అట్లే అంతిమ దినములగూడ గడపి, యింక మూడుదినములకు నిర్యాణము చెందు ననగ నాటి నుండి తన చిత్తము నంతర్ముఖము గావించినదై, యొకదినము శారదానందుని జేరబిలిచి, 'అందరి బాధ్యతను నీకు ఒప్పగించు చున్నాను. వారి గాపాడుము' అని పలికి, 1920 వ సంవత్సర మున జూలై 20 వ తేది రాత్రి ఒక్కటిన్నర గంటకు, అనగా దన అరువది యేడవయేట, భాస్కరుడు సాయం సమయమున నస్తమించురీతి, నీ ప్రపంచమను నాటకరంగమున దన పాత్రను సక్రమరీతి నిర్వహించి మన శారదామాయి, ప్రపంచమునుండి నిష్క్రమించెను. తల్లినిబాసిన బిడ్డలచందమున శిష్యవర్గము దిక్కు లేనివారైరి. ఆహా! ఎట్టి వారికైనను మృత్యువు తప్పదుగదా!

కాని 'పాపీ చిరాయుః సుకృతీ గతాయుః' అను సూక్తి [illegible]

మగుటయు భగవత్సంకల్పమేమో! లేనిచో సప్తవర్ష ప్రాయము
ననే సర్వసంగముల ద్రోసి, సకలవిద్యల గరతలామలక
మొనర్చుకొని, సర్వాధ్యాత్మికానుభవముల గడించి, సకలార్థ
సుశోభితమగు గ్రంథరాజముల రచించి, పరివ్రాజకుడై, దిక్చ
తుష్టయమున బీఠముల నెలకొల్పి, సమస్త దేశమును ధర్మ
బద్ధముగ నొనరించి, విజ్ఞాన సౌరభమును దేశము నల్గడల బ్రస
రింపజేసి, యతిసామ్రాట్టగు శ్రీ శంకరులేల తమ ముప్పది రెండవ
ఏటనే సిద్ధినొందవలె? బాల్యమాదిగ సమాధిసౌధముల విహ
రించుచు, సర్వశక్తినిలయయు, సామాన్యులకు భయంకరమూర్తి
యగు లోకమాత కాళిక నారాధించి, దర్శించి, అభయత్వము
నొంది, సత్వగుణ సంశోభితుడై, నిర్వికల్పసమాధి నిష్ఠుడై, సర్వ
దేవతాసాక్షాత్కారముల బడసి, సర్వమత సామరస్యమును
జాటి, కామకాంచన త్యాగమూర్తియై, పరమహంస చక్ర
వర్తియగు శ్రీ రామకృష్ణ గురుదేవుడు కంఠమున వ్రణముజనింప
దన ఏబదియవ వత్సరముననే యసువులు బాయుటేమి? పసితన
మాదిగ ధైర్యస్థైర్యాది సల్లక్షణములకు బట్టుగొమ్మయై, జ్ఞాన
కాంక్ష యభివృద్ధినొంద అధికతర ఆవేదనకు గురియై, శ్రీరామ
కృష్ణ సద్గురు చరణకమలముల నాశ్రయించి, సర్వముసాధించి,
త్యాగవాహిని వెల్లువకాగ సన్న్యాసగ్రహణము గావించి, దేశ
ముల గ్రుమ్మరి, పశ్చిమఖండమున కేగి, భారతీయ ఆర్షసంస్కృతీ
వైభవ రహస్యముల బోధించి, పండిత పామరుల బాదా
క్రాంతముగావించికొని, వేదాంత విజయపతాకను బ్రతిష్ఠించి,
మఠముల స్థాపించి, సర్వమత సౌభ్రాతృత్వమును బ్రకటించిన
ధీర యతివరేణ్యుడగు శ్రీ వివేకానందస్వామి తన ముప్పది

తొమ్మిదవవత్సరముననే శరీరమును జాలించె నెందులకు? ప్రపంచ సంస్కర్తల ఆయుర్దాయ మత్యల్పము. కాని సాధారణముగ ప్రపంచమును తమ భావజాలముచే నేమి, క్రియలచే నేమి బాధించువారి జీవితపరిమాణము అధికమా? ఏమి యీ వింత!

సాధారణ మానవులకును మహనీయులకును నిట భేదము లేదుగదా! కాని మామూలు వ్యక్తులైనచో మమకారముల దగుల్కొనుటచే మరణమనిన భయమొందెదరు. కాని ద్వంద్వాతీతులగు మహాత్ములు అయినచో మరణమును ఒక యాటవస్తువుగ బరిగణింతురు. సామాన్యులు మరల జన్మము నొందుదురు. మహాపురుషులు సచ్చిదానందమున లయించి, సర్వవ్యాప్తులై యొప్పారుదురు. మరియు, మోక్షార్థులమగు మనపై దమ కరుణా ప్రసారముల నుంచుచు మనల గాపాడుచు మనకు దోడునీడలై యుందురు.

ఇట్లు 'ఈ ప్రపంచమును క్రుళ్ళునీటిగుంటను నీ వామ పాదముయొక్క వ్రేలు యంటి యటంకముందే భగవత్సాక్షాత్కారమును బొందుటకు యత్నింపుము' అని విరాగ ముట్టిపడు శ్రీవివేకానంద వచనమురీతి, బసితనముననే ప్రాపంచిక విషయముల దొలగించి; మరియు ప్రపంచపరిజ్ఞానము దెలిసి దెలియకమున్నే సర్వబాధ్యతల వ్యావహారికముగ భర్తయగు శ్రీ రామకృష్ణునికి నర్పించి; శ్రీ రామకృష్ణుని జననిగ భావన జేయుటచే బవిత్రతను, గురుదేవునిగ సేవించుటచే నాధ్యాత్మిక సంస్థితులను, సర్వదేవదేవీ స్వరూపునిగ బూజించుటచే దేవత్వమును బొంది; పవిత్రత పునాదిగా గల్గినచో భగవత్సాక్షాత్కారము హస్తంగతమనియు, అట్టి పవిత్రత హృదయ పరి

వర్తనచేగాని గలుగదనియు, హృదయపరివర్తనయు నాత్మ నిగ్రహమునగాని లభ్యము గాదనియు, ఆత్మనిగ్రహము విష యత్వ ముడిగినగాని యసాధ్యమనియు నుపదేశించి; ఆ పవిత్ర తయే ప్రాతిపదికగాగల విశ్వవ్యాప్తమగు ప్రేమచే సర్వమానవ హృదయాధిష్ఠానదేవతయై, భక్తుల నవలీల మార్పు జేసి; 'యా దేవీ సర్వభూతేషు ప్రేమ రూపేణ సంస్థితా --' సర్వభూత ములయం దంతర్గతమై ప్రేమరూపమున నే జగజ్జనని యున్నదో అను సప్తశతీ వాక్యవిధానమున నిష్కల్మషప్రేమచే సర్వము సాధ్యమని సర్వప్రపంచమునకు భగవన్మాతృత్వమును జాటి; యఖిలమును ప్రేమమయము గావించి; యావత్ప్రపంచము నకు మాతృదేవియై చెల్వొంది; సర్వసంగ పరిత్యాగులగు యతివరేణ్యులచే నర్చింపబడుచు, గృహస్థులకు సన్యాసులకు నాదర్శమూర్తియై, సర్వసమత్వము నిరూపించి; సంఘమున స్త్రీలకుగల ప్రత్యేకస్థానమును వ్యక్తపరచి, స్త్రీ పవిత్రత కాలవాలమను యాదర్శమును లోకమునకు జాటి, స్త్రీ కర్తవ్య ముల నుపదేశించి, వందనీయయై, ఆరాధ్యదేవతయై, మహా తపస్వినియై, తారామండలమున జంద్రునివలె నారీలోకమున శీతకిరణ జ్యోతియై మన శారదామాయి మూర్తీభవించెను.

## శతవార్షిక జయంతి

పై విధముగ సర్వదేవతామూర్తియు, సర్వారాధ్యయు నగు మన శారదామాయి 1853 డిశంబరు మాసమున జనన మొందుటచే నీ 1953 డిశంబరునకు ఆమెకు శతవత్సర

ములు పూర్తి అయ్యేను, సామాన్యుల జీవితములు సుఖమును గాంచక బాధాకరములై, ప్రశాంతదూరములై యుండును. కాని మహాత్ముల జీవితము లట్లుకాదు. వారు శాంత్యానందముల మునింగి, శాంతి సంధాతలై మనుచు, తమ జీవితానంతరము సర్వమానవాళి హృదయ సింహాసనముల నధిష్ఠించి, సర్వవ్యాపకులై జగద్వంద్యులై యొప్పుచున్నారు. అట్టివారి జన్మదినములు పుణ్యదివసములు. అట్టివారి సాంగత్యమే సత్సాంగత్యము. అట్టివారి జీవితగాథల నాలకించుటయే శ్రవణము. వారి బోధల ననుసరించుటయే సాధన. వారి దర్శనభాగ్యము నొంది ఆ స్థితుల నుండుటయే సిద్ధి. కాన అట్టి పుణ్యచరితయగు మన శారదా జయంత్యుత్సవములు 1953 డిశంబరు నుండి, 1954 డిశంబరు వరకు ఒక సంవత్సరము శ్రీ శారదా శతవార్షిక జయంతి మహోత్సవములుగా సర్వ ప్రపంచమున నెల్లెడల నుత్సాహముగా సాగింపబడినవి. ఈ శ్రీ శారదా శతవార్షికోత్సవ శుభసమయమున దేశమెల్లెడల నామె నెట్లారాధించిరో, ఆమెనుగూర్చి సభలయందెట్టి ప్రసంగములు జరిగెనో, ఏ ఏ ఆశ్రమములు నూత్నముగా స్థాపితమో, ఏ ఏ వ్యక్తులామె జీవితాదర్శముల గొని సన్న్యాసస్వీకరణము గావించిరో, ప్రత్యేకముగ నామె జీవిత గ్రంథము లెన్ని వెలువడెనో మున్నగు విశేషముల గొన్నింటి గ్రహించి యానందించెదము గాక !

ఏతత్శుభసమయమున శ్రీ శారదాదేవి జన్మభూమియగు జయరామవటియందు శ్రీ శారదా మందిరమున శ్రీ శారదాదేవి చలువరాతి విగ్రహము 8-4-1954 న శ్రీ రామ

కృష్ణ మఠము మిషనుల యధ్యక్షులగు శ్రీ శంకరానంద స్వాములవారిచే ప్రతిష్ఠింపబడినది. ఈ విగ్రహము సుమారు మూడు అడుగుల పొడవుగలిగి శ్రీ శారదా ప్రేమతత్త్వమును మూర్తీభవింప జేయుచున్నదో యనునటుల సజీవమూర్తివలె నేత్రానందకరమై యొప్పుచున్నది. మరియు గుంటూరుజిల్లా బాపట్లలో శ్రీ అనుభవానంద స్వాములవారిచే స్థాపితమగు శ్రీ రామకృష్ణ భక్తసమాజమున, శ్రీ స్వాములవారిచే తయారు కావింపబడిన శ్రీ శారదామణీదేవి శిలాప్రతిమ 6-3-1954 శ్రీ రామకృష్ణ జయంతి సందర్భమున ప్రతిష్ఠింపబడినది.

3-1-1954 న బేలూరు మఠమునుండి సాలంకృత శ్రీ శారదా రామకృష్ణుల ఛాయా చిత్రములతో Ma 'మా' అను అక్షరము గల కాషాయ పతాకల సన్న్యాసు లెల్లరు ధరింప, సుమారు 4000 ప్రజానీకము వెంటనుండు ఒక పెద్ద ఉత్సవము దక్షిణేశ్వరమునకు బయలుదేరెను. ఆహా! ఆ సమయమున నెట గాంచినను మాతృస్మరణము దక్క నన్య మగోచరము. పుట్టి పెరిగిన స్థానముల బూజా సత్కారముల నొందుట సామాన్యముగ నెల్లరకు దుర్లభము. కాని మన శారద జన్మించిన ప్రాంతముననే యిట్లు గౌరవింపబడు అపూర్వము గదా!

మరియు నీసమయమున గలకత్తా నగరమున 2-4-1954 నుండి 6-4-1954 వరకు బంచాహ్నికముగా Women Devotees' Convention 'స్త్రీ భక్తుల మహాసభ' శ్రీ రామకృష్ణ మఠ, మిషనుల అధ్యక్షులగు శ్రీ శంకరానంద స్వాములవారి యధ్య

క్షతను జరిగెను. కుసుమము వికసించిన నా సౌరభము సర్వత్ర వ్యాపింప దాని నాఘ్రాణించియు, గొందరు అన్వేషించి పుష్పముందు తావుజేరి, దాని నవలోకించి ఆనందించు చందమున, మన శారద యను జ్ఞానకమలము వికసించి అందలి ఆధ్యాత్మిక సుగంధము సర్వత్ర బ్రసరించుటచే ముముక్షులోకము అద్దాని మూర్తినియు దృష్టిగాంచక, ఆమెను దర్శించుటకు నాడే వెడలిరి. కాని ఆమె నిర్యాణానంతర మా పారమార్థిక విజ్ఞాన పరిమళము దేశకాలావధుల నతీతించి, బ్రసరించి విజృంభించుటచే నేమో యీ శతవార్షికోత్సవ సమయమున ననేక దేశముల నుండి భక్తులరుదెంచి, సభలలో బాల్గొని, ఆ మాతృమూర్తి జీవిత విశేషముల ముచ్చటించి ఆనందించుట. ఆ తల్లి పవిత్రప్రేమ వాహినియో, ఆమె ఆధ్యాత్మిక సాధనా పాటవమో, ఆమె సర్వోత్కృష్ట ఆత్మశక్తియో, ఉపదేశ పటుత్వమో గాని వారి హృదయముల జొచ్చి కదలింపనిచో దూరదూర దేశములనుండి వా రరుదెంచుట సాధ్యమా! ఒక్కచో దన బిడ్డల నెల్లరిని జేర్చినది ఆమె పుత్ర పుత్రికా వాత్సల్యమే యని భావింప వలయును. భాషాభేదమున్నను, దూరాతి దూర ప్రదేశముల నివసించుచున్నను వారందరు నీ సమావేశమున గలియుట వారి పవిత్ర మాతృప్రేమకు, శ్రద్ధాభక్తులకు చిహ్నము కాదా! లేనిచో అస్సాము, కొచ్చిన్, మద్రాసు, పాట్నా, తిరువాన్కూరు, ఢిల్లీ, నాగపూర్, రంగూన్, కూర్గ్, కలకత్తాలనుండి అనేక ప్రతినిధులు సభల కేతెంచ గలరా? ఆ దివ్య పవిత్ర వాతావరణ మధ్యమున నెవరెవ రే యే విధమున

ప్రసంగించిరో యిసుమంత గ్రహించి, మనమును వారితో నానందించెదము గాక !

ప్రథమమున సధ్యక్షపీఠ మలంకరించి, అధ్యక్షోపన్యాస మును గావించిన శ్రీ శంకరానంద స్వాములవారి ఉపన్యాస సారాంశ మిది. 'మాతృశ్రీని ఆదర్శముగా గొనిన మీపై మహత్తర బాధ్యత గలదు. ఆమె పవిత్రాదర్శమును నిర్వ హించుటయే అది. సామాన్యుల కాదర్శము గమ్యము. మాతృ శ్రీకి అది సిద్ధము. సర్వజీవరాసుల దన బిడ్డలనుగ వాత్సల్య మున గ్రహించుటయే ఆమె యాదర్శము. అదియే ఆమెజీవన విధానము. అయ్యదియే మీ యాదర్శమును బాధ్యతయు నగు చున్నది. దీని గ్రహించి మీరు పీని మీ జీవితములయందు మేళవింప జేసికొనుటయందే యీ సభాసార్థకత ఆధారపడి యున్నది. దీని ఫలితమేమి ? ప్రథమతః మాతృశ్రీ మూర్తి మత్వమును మీరు పొందుట యను మీ అంతర్గత దేవత్వము నభివ్యక్త మొనరించు కొనుటయే అగును. నవయుగమున నావి ర్భవింపనున్న దివ్యమానవకోటిని మీరు పోషించుటయే ద్వితీయము. దీని మనసా, హృదయతః గ్రహించి, మాతృశ్రీ అడుగుజాడల ననుసరింప నవిచ్ఛిన్న కృషి సల్పుచు, నితరుల ప్రోత్సహించుటయే యీ సభాసదుల ముఖ్యతాత్పర్యమై యుండవలయును. మాతృశ్రీ శారదాదేవి శాంత్యానంద ములచే మీ జీవితముల మధురతర మొనర్చుగాక ! తన సంకల్ప సిద్ధికై మీకు ధైర్యవీర్యముల నొసంగుగాక !'

శ్రీ రామకృష్ణ మఠము మిషనుల ముఖ్యకార్యదర్శి యగు శ్రీ మాధవానంద స్వాములవారు తమ మలిపలుకున నిట్లు

వచించిరి. 'శ్రీ రామకృష్ణుని ధర్మపత్నియగు మాతృశ్రీ ఒక్క మాటలో మహాశక్తి. ఆమెలోగల అనేక విషయముల నా ఒక్కపదమే వ్యక్తపరచును. శ్రీ రామకృష్ణునియందు గల సర్వ శక్తులును ఆమెయందు గలవు. కాని ఆమె మన కింకను సన్నిహితము. ఆమె తన సర్వస్వమును మనకై త్యజించినది. ఆఘో ప్రఖ్యాతి వ్యాప్తము కాకమున్నే ఆమెను దివ్యమాతగా శ్రీ వివేకానందుడు గ్రహించియున్నాడు. ఆమెయొక్క ఆశీర్వాదబలమే అతని సంద్రముల దాటించి గొప్పవానిగా నొనరించినది. శ్రీ రామకృష్ణుడు సర్వప్రపంచోద్ధరణ కవతరించెను. కాని మాతృదేవి జీవితోపదేశములు సర్వ ప్రపంచమునకు శ్రేయస్కరములు. మాతృశ్రీని శ్రీ రామకృష్ణుడు దివ్యమాత కాళికగా నారాధించెను. దాని రహస్యము నామె గ్రహించి, శ్రీ రామకృష్ణునినుండి ప్రవహించిన అద్భుత పారమార్థిక శక్తిని ఆమె సంపూర్ణముగ బ్రపంచముపై బ్రసరింపజేసెను. మానవులపై నత్యద్భుత అసమాన ప్రేమమును బ్రసరింపజేసిన ఆమె జీవితము మీకు ఆదర్శమగు గాక! ఆమె జీవిత నిగూఢత్వమును బఠించి, ఆమె సర్వతోముఖత్వమును గ్రహించి, ఆమె అనుగ్రహముచే మీ జీవితార్థముల ఉద్దేశముల గ్రహించు కొందురు గాక! ఆమె ప్రతి సవిశ్వాస హృదయములో మూర్తీభవించుచున్నది.'

ఇక ఆహ్వాన సంఘాధ్యక్షురాలగు డాక్టరు రోమా చౌధురి స్వాగతోపన్యాసమున నీ క్రింది విషయముల బ్రసంగించెను: 'మాతృశ్రీ పంచమహావాణులు. 1) ఆత్మవిశ్వాసము 2) ఆధ్యాత్మికత 3) మాతృత్వము 4) నిష్కామకర్మ 5) ఏకాత్మ

వాదము...... ఈ పంచ మహావాణులు యీ అంధకార బంధుర వాతావరణమున బంచ ప్రదీపములై వెలుగొందుగాక! ఆ పంచ దీపికలతో మన జగన్మాత మాతృశ్రీకి మనము హారతి నొసంగెదముగాక ! ఆ పంచజ్యోతులను మన జీవితములకు వెలుగు నొసంగునట్లొనరించి ఆమెకు సర్వార్పణపూర్వక సాష్టాంగ వందన మొనరించెదము గాక!'.

మరియు నాహ్వానసంఘ కార్యదర్శిని యగు శ్రీమతి సుభద్రా హస్కార్ ఒసంగిన ఉపన్యాస విశేషములివి. 'ఇక మన మతృమూర్తి. ఆమెనుగూర్చి ఎవరు ఏమి వచింపగలరు ? ఆమె అద్భుతము. ఆమెను వర్ణింప వాక్కు అశక్తము. కాని అప్పుడప్పుడు ఆమెనుగూర్చి కొన్ని తాత్కాలిక దృశ్యములు గోచరించి మనల జకితుల జేయుచుండును. ప్రేమ త్యాగముల సమన్వయమే ఆమె. అవియే శాంత్యానందములకు మార్గము. దుఃఖ ద్వేషములులేని జీవితము నామె మన కొసంగు గాక!'.

అంత గొలదిగ ప్రతినిధులుగ నేతెంచినవారి ఉపన్యాస విశేషముల రెండు మూడు మాత్రము కాంచెదము గాక ! మదరాసు నగరమునుండి యరుదెంచిన సోదరి సుబ్బులక్ష్మి గ్రిటుల వచించెను. 'నిరాడంబర జీవనము ఉన్నత భావనము ఆమె సుగుణములు. ఆమె భాషణము సంపూర్ణాశీర్వాద రూపము. ఆమె వచనములు శాంతిదములు. ఆమె క్షమా స్వరూపము. మనము యీ విషయముల మాతృశ్రీ జీవిత మును పఠించి, గ్రహించి అనుసరించెదము గాక !'. మరియు 'మానవుని హృదయములో దన జీవిత విధానమును శాశ్వత

ముగా ముద్ర వేయఁగల్గునది మన శ్రీ శారదాదేవి జీవితము. ప్రపంచము కల్లోల పరిస్థితుల నుండు కాలమున మన మాతృశ్రీ అవతరించి కొందరిచేత ననుభవ వేత్తగను సద్గురువుగను, మరియు ననేకులచే బరదేవతగను తన జీవితకాలముననే ఆరాధింప బడినది. జాతి మత లింగ వర్ణాదిక విభేదము లేని విశ్వజనీన మైనదే ఆమె మాతృత్వము. ఇతరుల దొసగుల గాంచజాల నిదే ఆమె ప్రేమతత్వము. ఆమె పాదసన్నిధి మన జీవితపు తృష్ణ సంతృప్తిగాంచి, మన జన్మసార్థకమై, అనేక జన్మ సంప్రాప్త పాపసంచయము నశించి ధన్యుల మయ్యెదము గాక!' అని శ్రీమతి చంద్రకుమారి హాండూ ఉపన్యాస వచనములు. 'మాతృ దేవి మనవలె విశ్వకళా పరిషత్ బిరుదముల కారాట మొందలేదు. కాని అజ్ఞానమును నశింపజేసి, ప్రేమ తత్త్వమున నత్యద్భుతరీతి ఆమె జ్ఞానప్రదాన మొనర్చుట నింతవరకు నే చరిత్రవలన లేని మహిమా విశేషము. సుస్మిత పరిమళ మొసంగు గులాబికుసుమ జీవితమామెది. ఆఘ్రాణింపకున్నను ఆపుష్పము సుగంధము నొసంగును. దాని నలిపినచో నధికముగ సౌరభమునిడును. త్రుంచి జలమునందుంచుచో బన్నీ రగును. అటులే శారదాదేవి జీవితముగూడ. ఆమె కష్టములు త్యాగములు ఆమె జీవితమునకు నధికతర శక్తి దివ్యత్వముల బ్రసాదించినవి. భానుకిరణముల చందము ఆమె దివ్యోపదేశ ములు ప్రపంచవ్యాప్తముగ బ్రసరించినవి' అని న్యూఢిల్లీ నివా సినియగు శ్రీమతి సీతాబాయి యుపన్యాస సారాంశము.

ఆ శతవార్షిక శుభకాలమున అనగా 27-12-1953 న శ్రీ శారదా శతవార్షిక జయంతి స్మారకముగ, 5000 వత్సర

ముల బూర్వమునుండిగల నారీలోకముయొక్క గార్హ్య, సాంఘిక సాంస్కృతిక, ప్రభుత్వ, పారమార్థిక పరిస్థితుల దెలియపరచు Great Women of India 'భారతీయ నారీరత్నములు' అను గ్రంథరాజము పలువురు విద్వాంసులచే లిఖింపబడి ప్రచురింపబడినది. మరియు శ్రీ గంభీరానందస్వాములవారును 'మాతృ శ్రీ శారదా దేవి' యనుజీవిత గ్రంథమును బ్రకటించిరి. 1954 డిశంబరు న Women Saints of East and West 'ప్రాక్ ప్రతీచీ బ్రహ్మవాదినులు' అను గ్రంథము ఇంగ్లండులో ముద్రితమైనది. సౌరాష్ట్రమునగూడ శ్రీ శారదా దేవి యుపదేశములు గుజరాతీ భాషలో 'మాతృవాణి' అను గ్రంథముగా నీ సమయముననే వెలువడెను. పై వివరింపబడిన చందమున నింకను నెన్నియో గ్రంథములు పలువురచే రచితమై అచ్చొత్తింంచబడినవి.

ఇంకను గుంటూరుజిల్లా బాపట్లయందును, విశాఖపట్టణ జిల్లా భీమునిపట్టణమునందును శ్రీ రామకృష్ణ భక్తసమాజము, శ్రీ శారదా రామకృష్ణ సంఘము నాబడు సంస్థల స్థాపకులును, సద్గురువరేణ్యులును అగు శ్రీమదనుభవానంద స్వాములవారిచే 1951 లో 'శ్రీ రామకృష్ణ లీలా సంకీర్తనము' అను ప్రథమ కుసుమముతో శ్రీ అనుభవానంద గ్రంథమాల ప్రారంభింపబడి, శ్రీ శారదా శతవార్షికజయంతి ప్రచురణములుగా 27-12-1953 'మన శారదామాయి', 26-1-1954 'మన వివేకానందుడు', 6-3-1954 'మన రామకృష్ణుడు' అను గ్రంథత్రయము నాచే లిఖింపబడి ముద్రితములైనవి. అంతియకాక నిదే సమయమున శ్రీ అనుభవానంద స్వాములవారు, ఆధునికకాలమున విరివిగా ప్రచారముననున్న భౌతికశాస్త్రమును Science, మన ప్రాచీన

భారతీయ తత్త్వశాస్త్రముతో Philosophy బోల్చి, ఆ పార మార్థిక విజ్ఞానవైభవ ప్రాశస్త్యమును వివరించుచు, 'సర్వ సిద్ధాంత సౌరభము' అను ఉద్గ్రంథమును షోడశకళారూపమున షోడశభాగములుగా ప్రచురింప సంకల్పించి, అందు సాంఖ్య యోగదర్శనద్వయ ప్రథమభాగమును ప్రకటించిరి. అట్లు శత వార్షిక పుణ్యసమయమున నామె యాశీస్సుల గ్రహించిన 'సర్వ సిద్ధాంత సౌరభము' తన 16 భాగములలో నేటికి 6 భాగములు ముద్రింపబడి, తన సౌరభముచే నెల్లర నాకర్షించి ఆనందపరచి, విశ్వకోశమని కీర్తినార్జించి, దేశవ్యాప్తమై చెల్వొందినది. అవును, ఆ జగన్మాత ఆశీస్సులేగదా శ్రీ వివేకా నందుని సాగరముల దాటించి సర్వఖండముల గీర్తిచంద్రికల ప్రసాదించినది! అందుచే నా చల్లని ప్రేమాశీస్సులే మనకు సర్వదా స్మరణీయములు.

అట్లే అనేక స్థలముల నూత్న ఆశ్రమస్థాపనములును నూతన కట్టములును నిర్మితములయ్యెను. ఈ సమయమున గల కత్తానగరమున ప్రత్యేకముగా స్త్రీల కొక మఠము స్థాపింప బడెను. మరియు భీమునిపట్టణమున గల శ్రీశారదా రామకృష్ణ సంఘమున, పూజామందిర పురోభాగమున నొక సుందరసువిశాల మందిరము శ్రీ అనుభవానంద స్వాములవారిచే నిర్మితమై, 'శ్రీ శారదా శతవార్షిక జయంతి మండపము' అను నామ మున నొప్పుచున్నది. ఇంకను యిట్టివి ఎన్నియో!

మరియు 27-12-1953 కలకత్తా శ్రీ రామకృష్ణ మఠ మున నేడుగురు స్త్రీలు బ్రహ్మచర్య దీక్షను గైకొనిరి. ఆ శుభ

సమయముననే 28-8-1954 శ్రావణమాసమున, శ్రీ శారదా దేవి కతి సన్నిహితముగ మెలగుచు, ఆమె ప్రేమవాత్సల్య ముల జూరగొనియుండిన శ్రీ అసితానందస్వాములవారిచే భట్టి నగర్‌లో స్థాపితమైన శ్రీ యోగేశ్వర రామకృష్ణ మఠమునందు వారి అధ్వర్యమున విరజాది హోమముల జరిపించి, శ్రీ అను భవానంద స్వాములవారు నాకు సన్న్యాస దీక్షనొసంగి, మాతాజీ త్యాగీశానంద పురీ అను యోగపట్టమును ప్రసా దించిరి.

1953 డిశంబరు నుండి 1954 డిశంబరు పర్యంతము గల శ్రీ శారదా శతవార్షికోత్సవ సందర్భమున శ్రీ అనుభవానంద బృందముగూడ విరివిగా బర్యటించి, శ్రీ మాతృదేవి సందేశ ముల ఉపన్యాస రూపమున ప్రచారము చేసియున్నది.

ఆ సంవత్సరమంతయు ననేకులు ఆ మాతృమూర్తిపై గల భక్త్యుత్సాహములచే బత్రికలలో బహుళరీతి వ్యాస ముల రచించిరి. ఏ పత్రికల జూచినను ఆమెయొక్క సందేశ ములే. అట్లు పత్రికాముఖమున వెలువడిన వ్యాససంచయ మున, 'మానవునిలో దివ్యత్వం దర్శించిన మాతృశ్రీ' యను యొక వ్యాసమున 'బ్రిజలు తండోపతండముగా ఆలయములో నున్న అర్చామూర్తులను సేవించునట్లు మానవాకృతి నున్న శ్రీ మాతృదేవి శారద నారాధించెడివారు. ఈ వైభవము బుద్ధదేవునికి గాని, క్రీస్తునకు గాని, కడకు శ్రీ రామకృష్ణునికైన వారి వారి జీవితములలో గలుగలేదు. పుణ్యమాతను దివ్య మాతగ సహస్రాధికముగు ప్రజలు ఆరాధించుటను నేను ప్రత్య

క్షముగ జూచియున్నాను. ఆరాధన కెదురుచూచుటగాని, దానిచే మిడిసిపాటు గాని ఆమెకు లేదు. లేనే లేదు' అని శ్రీ శారదాదేవిని గూర్చి శ్రీ ప్రభవానంద స్వాములవారు రచించిన వాక్యములు శ్రీ శారదాదేవియొక్క ప్రతిభను విశదీకరించుచున్నవి.

పై విధముగ, చిన్న కుగ్రామమున జనించి నాగరికతల మున్గు పట్నవాసులను, పుట్టుపేదగా జన్మించి ధనమే సౌఖ్యదమని భావించు ధనికవర్గమును, గ్రంథజ్ఞానమే విద్యయని భావించు గ్రంథజ్ఞానవిదూరయై పుట్టోంది, పాండిత్య ప్రధానులగు విద్వద్వరేణ్యులను దన దివ్యాధ్యాత్మికానందానుభవములచే నాకర్షించి, శత వత్సరములలో విశ్వవిఖ్యాతి నార్జించి, లోకారాధ్యయై, సర్వముముక్షుల హృదయసింహాసనముల నధిష్ఠించి, జగద్గురువైన మన మాతృమూర్తియగు శ్రీ శారదాదేవి ప్రపంచవ్యాప్తముగ దన శతవార్షికోత్సవముల నొకవత్సరము కొనసాగించుకొనుటయం దాశ్చర్య మిసుమంతయును గానరాదు. కాని పూర్వమెచటను ఒక తపస్వినీమణి యింతటి గౌరవమును బొందినట్లు నే చరిత్రయందును నగోచరము. ఏకాంతాతిలకము తన ఉన్నతాధ్యాత్మిక సంస్థితుల దుల దూగునో అట్టి నారీమణి 'త్రైలోక్య జననీ' ముల్లోకములకు జననియను అష్టావక్ర గీతోక్తి చందము విశ్వజననిగా వెలుగొందును. ఇదియే స్త్రీయాదర్శము! ఇదియే అజ్ఞానమును బారద్రోలు రాచబాట! ఇదియే క్షణికానందముల దూరము జేసి శాశ్వతానందమున నిత్యముగానుంచు భారతీయ పారమార్థిక [illegible]తము!

అట్టి పరదేవతామూర్తిగ భావించియే శ్రీ వివేకానంద స్వాములవారు తనలేఖలలో 'తండ్రి కటాక్షముకంటె దల్లి కటాక్షము నాకు గోటిరెట్లు మాన్యము. మాతృదేవి యను గ్రహమును ఆశీస్సులును నాకు వరప్రసాదములు' అనియు, 'శక్తి వినా లోకమునకు బునరుజ్జీవనములేదు. శక్తి కటాక్షము వినా నేదియు సాధింపజాలము. అకలంక హృదయముతో, శుద్ధ సాత్త్వికభావముతో శక్తిని తమ మాతృదేవతవోలె నారాధించువా రెట్టి శ్రేయము నొందుదురో ఊహింపుము. భారత దేశమున నాయద్భుతశక్తిని బునఃప్రతిష్ఠజేయుటకే అమ్మ జన్మించినది. ఆమెను మూలాధారముగ గైకొని గార్గులును మైత్రేయులును లోకమున మరల ప్రభవింతురు' అని శ్రీశారదా దేవి యాధిక్యతను దివ్యదృష్టిచే గ్రహించెనో అనునట్లు భావి కాల విశేషముల ముందుగనే నాడే ఉ కించెను. శ్రీ వివేకానందుని వచనము లెంతయు సత్యము. వ మ్మాటికి సత్యము. అందుచేత శతవార్షిక సమయముననేగాక శ్రీ శారదామాయి సర్వోత్కృష్టతను గ్రహించిన వనితామణులు భారతదేశమునందేగాక పాశ్చాత్యమునగూడ సన్న్యాసగ్రహణము జేయుచున్నారు. అమెరికాలో దక్షిణ కాలిఫోర్నియాలో 1959 లో సెప్టెంబరు మాసప్రాంతమున నైదుగురు మహిళలు వేదాంత సంఘాధ్యక్షులగు శ్రీ ప్రభవానందస్వాములవారిద్వారా విరజ హోమాదుల జేసి, సన్న్యసించి, 'పరివ్రాజిక' అను సన్న్యాసపట్టమును, హాలీవుడ్ కేంద్రమునుండి ఏ తెంచిన మరి ముగ్గురు స్త్రీలు బ్రహ్మచర్యదీక్షను గైకొనిరి. ఇకముందు ఎందరామెను ఆదర్శముగాగొని, ఆదర్శులై, ప్రపంచాదర్శముగ వెలుగొందగలరో!

# ప ర్య వ సా న ము

పై విధముగ, మన శారదామాయి జీవిత విశేషము లలో, ప్రాపంచిక విషయపరిజ్ఞాన మెరుగని అమాయక హృదయముతో శ్రీ రామకృష్ణుని కాత్మనివేదన మొనర్చు కొనుటయు, పండితపామరులచే నవతారవరేణ్యునిగ నర్చింప బడుచుండు శ్రీ రామకృష్ణునిచేతనే బూజింపబడుటయు, నను విశిష్టత ప్రస్ఫుటముగ గోచరము. అట్లు ఆమె సర్వార్పణ ముచే సర్వోత్కృష్టాధ్యాత్మికానుభూతులయం దోలలాడుటయు, పూజనీయస్థానము నొందుటచే జగద్వంద్యయై నలరారుటయు బిడ్డలమగు మన కెల్లరకు బరమాదర్శమును పరమానంద దాయకమును గదా!

స్త్రీకి ప్రత్యేకస్థానము పైన వ్యక్తము. ఆస్థాన మెట్టిది? అదియే మాతృత్వము. ప్రతి స్త్రీ మాతృత్వము ననుభవించుచున్నదిగదా యనిన ఒకరిద్దరు బిడ్డలకు దల్లి యగుటమాత్రముగాక సర్వప్రపంచమున జరాచర భూత కోటికెల్ల మాతృదేవియై తనరి, జ్ఞానసువాసనల వెదజల్లుచు జ్ఞానప్రదాత్రి యగుటయే స్త్రీ యొక్క పరమాదర్శమగు మాతృత్వము. దానిని బొందిననాడే సంఘమున స్త్రీకి ప్రత్యేక స్థానము, నాడే గౌరవమర్యాదలు, నాడే లోకపూజ్యత, నాడే సర్వప్రపంచము ప్రపన్నమగుట. అట్టి స్థితిని బొందిన మన శారదామాయి జీవిత ప్రాధాన్యమును మన మెల్లరము ప్రసాదించు యీ శ్రీ శారదా శతవార్షిక జయంతి సమా

త్సవమహిమచే మన శారదామాయి యడుగుజాడల నను సరించి కంకణధారులమై అవ్యయమైన ప్రశాంతి నచిరకాలమున నామె యనుగ్రహముచే బొంది, యానందించి, 'స జాతో యేన జాతేన యాతి వంశ స్సమున్నతిం' ఎవని జననముచే వాని వంశము ఉన్నతినొందునో వాడే జనించిన వాడు అను భర్తృహరి వాక్యానుసారముగ మాత్రమేగాక, సకలప్రపంచమున కున్నతాదర్శము నిచ్చువాడే జనించిన వాడనునట్లు మన జీవితమును ధన్యముగావించుకొని 'ఉదారచరితానాం తు వసుధైవ కుటుంబకం' ఉదారచరితులకు ప్రపంచమే కుటుంబమనురీతి విశ్వవ్యాప్తప్రేమచే విశ్వాదర్శమును బడయుదుముగాక!

యత్ర నార్యః పూజ్యంతే రమంతే తత్ర దేవతాః

# జీవిత విశేషములు

1. 22-12-1853 మార్గశిర బహుళ సప్తమి - జననము.

2. మే 1859 వివాహము-కమార్పుకుర ప్రథమాగమనము.

3. మార్చి 1872 దక్షిణేశ్వరమునకు ప్రథమాగమనము.

4. 5-6-1872 షోడశీపూజ.

5. 16-8-1886 శ్రీరామకృష్ణుని మహాసమాధి.

6. ఆగస్టు 1886 బృందావనయాత్ర-తపస్సు.

7. 1888 కలకత్త - పునరాగమనము.

8. 23-5-1909 ఉద్బోధన్ - కలకత్తా నివాసము.

9. 1911 రామేశ్వరాది దక్షిణయాత్ర.

10. డిశంబరు 1919 రుగ్నత.

11. 21-7-1920 మహాసమాధి.





# శ్రీ అనుభవానంద గ్రంథమాల

## ప్రచురణములు

1. శ్రీరామకృష్ణ లీలా సంకీర్తనము : (చతుర్థ ముద్రణము)

శ్రీరామకృష్ణ, శారద, వివేకానందులగూర్చి భక్తి ప్రబోధ కరముగా 182 కీర్తనలు.

$\frac{1}{16}$ డెమ్మీ. 200 పుటలు. రు. 0-62

2. శ్రీరామకృష్ణాంజలి : (తృతీయ ముద్రణము)

శ్రీరామకృష్ణ వివేకానంద తత్త్వములగూర్చి భక్తి ఉత్సాహ పూరిత పద్యములు 100. 0-12

3. శ్రీ దక్షిణేశ్వరీ స్తవము : (ద్వితీయ ముద్రణము)

భక్తితో తత్త్వవిషయముల ప్రబోధించు శతకము. 0-12

4. చిత్త ప్రబోధ : (ద్వితీయ ముద్రణము)

సాధకుల కనేక అమూల్య రహస్యముల బోధించు శతకము. 0-12

5. సాధనరహస్యము : (తృతీయ ముద్రణము)

ఆధ్యాత్మికాభి వృద్ధికి మూలమైన యోగసూత్ర సాధన చతుష్ట యముల చక్కని వ్యావహారిక భాషలో తెలిపిన సుప్రసిద్ధ గ్రంథరాజము.

$\frac{1}{8}$ క్రౌను. 340 పుటలు. 2-25

6. అనుభవానందము : (ద్వితీయ ముద్రణము)

అద్వైతానంద విభూతిని వ్యక్తపరచు శతకము. రు. 0-12

7. సాధనసుధ :

సాధనలో దగులు ఆటంకముల నివారింప అమూల్యమగు
సలహాల నొసంగు పద్యగ్రంథము.

1/8 క్రౌను. 62 పుటలు. 0-50

8. మన శారదామాయి : (ద్వితీయ ముద్రణము)

శ్రీ త్యాగీశానంద విరచితము. జగన్మాత శ్రీ శారదామాయి
జీవితోపదేశముల వివరించు ఉత్సాహపూరిత సులభగ్రంథము.

1/8 క్రౌను. 116 పుటలు.

9. మన వివేకానందుడు : (ద్వితీయ ముద్రణము)

శ్రీ త్యాగీశానంద విరచితము. వేదాంతకేసరి శ్రీ వివేకా
నందుని జీవితాదర్శముల ప్రబోధించు ఉత్కృష్ట గ్రంథము.

1/8 క్రౌను. 110 పుటలు.

10. మన రామకృష్ణుడు : (ద్వితీయ ముద్రణము)

శ్రీ త్యాగీశానంద విరచితము. జగద్గురు శ్రీరామకృష్ణుని
అద్భుతాదర్శ సాధనవివరముల సుగమముగావించు గ్రంథము.

1/8 క్రౌను. 125 పుటలు.

11. సర్వ సిద్ధాంత సౌరభము : 1 వ భాగము.

దర్శనఖండము - ప్రథమ భాగము - సాంఖ్య యోగములు.
శ్రీ కపిల పతంజలి మహాత్ముల జీవితకాల విశేషములు సిద్ధాం
తములు యిట చర్చితము.

1/8 క్రౌను. 350 పుటలు.

12. శాంతి సామ్రాజ్యము :

శాంతినిగోరు నేటి ప్రపంచమునకు శాంతి ప్రబోధ గావించు ఉత్తమ గ్రంథము.

$\frac{1}{8}$ క్రౌను. 40 పుటలు. రు. 0-38

13. శ్రీరామకృష్ణాదర్శము :

శ్రీరామకృష్ణుని సాధన, సిద్ధుల రహస్యమును వివరించు ఉత్తేజకర విపుల గ్రంథము.

$\frac{1}{8}$ క్రౌను. 24 పుటలు. 0-12

14. శ్రీరామకృష్ణ పూజ :

శ్రీరామకృష్ణ పూజావిధానము సహస్ర అష్టోత్తర శత నామములతో నలరారు గ్రంథము.

$\frac{1}{16}$ డెమ్మీ. 71 పుటలు. 0-50

15. సర్వ సిద్ధాంత సౌరభము : 2 వ. భాగము.

దర్శన ఖండము - ద్వితీయ భాగము - వైశేషిక న్యాయములు - శ్రీ కణాద గౌతమ మహర్షుల జీవితకాల సిద్ధాంతములు పండితాభిప్రాయములతో రచితము.

$\frac{1}{8}$ క్రౌను. 300 పుటలు. 3-00

16. సర్వ సిద్ధాంత సౌరభము : 3 వ భాగము.

దర్శన ఖండము - తృతీయ భాగము - మీమాంసా ద్వయము - శ్రీ జైమినీ వ్యాసమహర్షుల జీవితకాల సిద్ధాంతములు ఆధునిక పండితాభిప్రాయములతో రచితము.

$\frac{1}{8}$ క్రౌను. 340 పుటలు. 3-00

17. సర్వ సిద్ధాంత సౌరభము: 4 వ భాగము.

అద్వైతఖండము - ప్రథమ భాగము - శ్రీ శంకరభగవత్పాదా

ద్వైతము - వేదముల నుండి శ్రీశంకరులవరకు ప్రవహించు అద్వైత రసప్రవాహమును ముందుంచు విపుల గ్రంథము. అద్వైత సిద్ధాంతమునకు, ఆధునిక భౌతిక విజ్ఞానమునకు సమన్వయము జూపును.

⅛ క్రౌను. 440 పుటలు. రు. 4-25

18. మాండూక్య రసాయనము:

శ్రీ అనుభవ భాష్యము. 108 ఉపనిషత్తుల ముఖ్య మంత్రములతో, గౌడపాద కారికలతో వ్యాఖ్యాతము.

⅛ క్రౌను. 160 పుటలు. 1-25

19. సర్వ సిద్ధాంత సౌరభము : 5 వ భాగము.

అద్వైతఖండము - ద్వితీయ భాగము-శ్రీ శంకరాద్వైతము. శ్రీ శంకర జీవితకాల విశేషములు, అద్వైత సిద్ధాంతము విస్తృతముగా వివరింపబడినవి. సన్న్యాసప్రాశస్త్య, అధికార వివరములు గలవు.

⅛ క్రౌను. 536 పుటలు.

20. సర్వ సిద్ధాంత సౌరభము: 6 వ భాగము.

అద్వైతఖండము - తృతీయ భాగము - శ్రీ శంకరానంతరాద్వైతము-శ్రీ సురేశ్వర విద్యారణ్య వాచస్పతి నిశ్చలదాసాది కర్తల భావవివరణము విపులముగా నిందుండును.

⅛ క్రౌను. 376 పుటలు.

21. సర్వ సిద్ధాంత సౌరభము: 7 వ భాగము.

వైష్ణవ ఖండము - ప్రథమ భాగము - (అచ్చు)